# తెలుగురాజు



పండిత సత్యనారాయణ రాజు

# పురస్కృతి

'రాజచరితలు కవిరాజ చరితలకు లొచ్చు' అన్నారు. అయితే, ఇది రాజచరిత, కవిరాజచరిత కూడాను. మీదు మిక్కిలి తెలుగురాజచరిత కావడంవల్ల ఇది రసికులకు ముప్పిరియైన సమ్మోదం కూరుస్తుంది.

వీరేశలింగంపంతులు 'స్వీయచరిత్రం' రచించినపిమ్మట తెలుగులో అట్టి చరిత్ర లనేకంగా పుట్టినవి. ఆ చరిత్రలన్నీ వచన గ్రంథాలు. పంతులుగారి స్వీయచరిత్రకంటె ముందే మా గురుపాదులు, స్మరణీయులు శతావధాని వేంకట శాస్త్రిగారు తమ చరిత్రను 'జాతకచర్య' అనే పేరుతో పూర్వభాగం రచించారు. ఆ గ్రంథం 1935లో అచ్చయింది. ఇపుడు ఉత్తరభాగంకూడా వెలువడింది. కాగా స్వీయ చరిత్ర రచనకు వేంకటశాస్త్రిగారే ఆద్యులని చెప్పవలసి ఉంటుంది. అయితే, 'ఆ జాతకచర్య' పద్యకావ్యం. శాస్త్రి గారు తా మనుభవించిన కష్టసుఖాలకు, పొందిన కీర్తి ప్రతిష్ఠలకు కారణం తమ జన్మకాలమందున్న గ్రహాలే అని ఆ భారమంతా వానిపై వేసి, జ్యోతిశ్శాస్త్రానికి లక్ష్య ప్రాయంగా తమ జీవితవిశేషాలను అందు వ్యాఖ్యానించారు.

పురుషకారంకంటె దైవం బలీయమని యెంచే ప్రాచ్య సంప్ర దాయాన్ని పాటించి శాస్త్రిగారు అలా రచించారు.

శ్రీ సత్యనారాయణరాజుగారుకూడా దీన్ని పద్య కావ్యంగా రచించారు. కాని జాతకచర్య రచనాపద్ధతి వేరు. దీనిపద్ధతి వేరు.

స్వీయచరిత్రరచన చాలా చిక్కులతో కూడినది. ఇందు సత్యాన్ని వినయంతో జోడించాలి. గాంధీజీవంటి వారికే తప్ప ఇతరుల కా పని సులభసాధ్యం కాదు. ఇంతచేసినా, ఇట్టి రచనలకు కావ్యలక్షణాలు పట్టవు.

రాజుగారు స్వభావంచేత కృతజ్ఞులు కావడంవల్ల వారు ఇతరులవల్ల పొందిన మేళ్లను స్మరించేఘట్టాలు కొంత భావ సంపన్నంగా రచించగలిగారు. అందులోనూ ముక్కాకలు దీరిన కవీశ్వరులు వారు. జయపురారణ్యసీమలను వర్ణించే పట్టుల్లోకూడా రాజుగారి కవితాప్రజ్ఞ కొంత రెక్కలు విప్పికొన్నది. సత్యకథనమాత్రములైన తక్కిన భాగా లన్నిటా రాజుగారి పరిణత రచన కనిపిస్తూనే ఉంటుంది.

బహుగ్రంథకర్తలై, అనేక రాజసత్కారాలంది లబ్ధ ప్రతిష్ఠులైన రాజుగారి రచన కిట్టి పురస్కృతితో పని లేకున్నా, నాయందలి ప్రీతికొద్దీ వారు నాకీ పని కల్పించి నన్ను గౌరవించినవారైనారు.

20–11–57
విజయవాడ

కొటూరి వెంకటేశ్వరరావు

ఓం

# కృతి సమర్పణము

శ్రీ బ్రాహ్మీ జల జాల యాచలసుతాస్మేరానన శ్రీయుతుల్
శ్రీ బ్రహ్మాంబుజపత్రలోచన శివుల్ చిత్తంబు లుప్పొంగఁగా
శ్రీ బ్రహ్మాయువు భాగ్యమున్ శివముఁ బ్రస్ఫీతంబుగా నిచ్చి శ్రీ
సుబ్రహ్మణ్యుని నన్నుమిల్లి కులజున్ సుశ్లోకు రక్షించుతన్.

శ్రీయుక్తోభవ పౌత్రవాన్భవ జనస్తేహాభి రామో భవే
త్త్యాయుష్మాన్ భవ మంత్రిరాడ్భవ యటంచాశీస్సులం జేసి నే
నీయం బూనితి నాదు జీవిత కథా హృద్యాంధ్ర కన్యామణిన్
పాయంజాలని ప్రేమభావమున సుబ్రహ్మణ్యా! కైకోఁగదే!

గోళీని దిగమ్రింగి యోలిమై నముఁజేరి
బేలవై చూచిన జాలిచూపు
పట్టుదట్టిని దెచ్చి సుట్టి గుఱ్ఱంబుపై
స్వారి చేయించిన గారవంబు
వడ్లకళ్ళములోన బైసికి లెక్కించి
త్రొక్కించినట్టి సంతోష గరిమ
పోష్టులో నిడుమన్న పోష్టుకార్డొక నెల
జేబులో నుంచిన చిలిపితనము

తఱచు నను( గొనివచ్చి సిద్ధాంతమందు
నమ్మ వర్ధింపఁ దిన్న రాజాన్న, మన్ని
భావనావీథి విహరించి భవ్యకావ్య
వనిత సృష్టించె బాబు! చేపట్టవయ్యా!

నవనవ యౌవనం బెసఁగి నా మెయిఁ బుల్కలనెత్తుచుండఁగా
నవనవ బాలభావమున నవ్వుచు నా యెదఁజేరి యాడి నీ
వవిరళ బంధుభావమున నప్పుడు చూపిన రాగపూర మీ
కవన విలాసకన్యయయి క్రమ్మఱి నీ యెదఁ జేరె నేలుమీ!

కవి చరితమ్ము నంకితముగాఁ గొను భాగ్యము నీకు దక్కె నీ
భవము తరించె సాధుజనవంద్యుఁడ వైతివి పెద్దబాబు! నా
భవమును సార్థకంబె యని స్వాంతమునందుఁ దలంచుచుంటి నీ
భువనము లున్ననాళ్ళు మన పూర్ణయశంబులు వృద్ధిఁజెందుతన్.

కమ్మఁదనాన కిక్కవని కన్నెఱ వచ్చి వరించె నిన్ను తా
త్రమ్మునఁ బెంచఁగాఁబడిన రాజకులాంగన భూషితాంగి గా
త్రమ్ము సమస్తమున్ రసముదావహమై విలసిల్లు నేఁటి కా
వ్యమ్మును నా కుమారిఁ బెదబాబు! రసజ్ఞుఁడవై వరింపుమీ!

మాయురె! మీకు మాకును సమానముగా నిలుదిద్దు పెద్ద నా
రాయణరావు బ్రహ్మయయి రాచఱికంబుల రెంటిఁ జేర్చి య.
త్యాయతిఁ బెండ్లి చేసె మరియాదగ నాదగు కావ్యకన్యకన్
హాయిగ నేలుకో సరసమైన తలంపులు పూచి కాయఁగన్.

రాయల కావ్యపుష్టియును రాయల కమ్మఁదనంబు నేకమై
కాయము దాల్చినట్టి మన కామిత కల్పక మస్నమల్లి నా
రాయణ రావె యీ శుభకరంబగు మూరుతమందు బాబు! నీ
నా యశ మించ దీవనలనంతముగా నిత్తు మ్రొక్కు మర్మిలిన్.

కల మాన్నములు గూర్చ ఖండికల్ గూర్చిన
వృద్ధ సుబ్రహ్మణ్య మెవని తాత
కార్యశూరుండైన సూర్యనారాయణ
దాత యెవానికి దత్తు తండ్రి
పిత్రార్జితమ్ములఁ బెంచి యొసఁగిన గో
పాల కృష్ణయ్య యెవ్వాని తండ్రి
రమణాను వర్తిని లక్ష్మి నరస మాంబ
కడుపార నెవ్వానిఁ గన్నతల్లి

దుర్గ చిట్టెమ్మ లెవ్వని తోఁడఁబుట్టు
లెవని కనుజుండు జాణ విశ్వేశ్వరుండు
రామకృష్ణరాఘవులు నే ప్రాజ్ఞ బావ
లట్టి రసికు సుబ్రహ్మణ్యు నందు సుకృతి !

కాకతి రుద్రదేవు కడ కాఁకలు దీఱిన కమ్మవారిలో
ప్రేకఁదనంబు గాంచి పృథివీస్థలి నేలిరి పెమ్మసాని వా
రా కమనీయ వంశమున యందు జనించిన రాణి తోడుగా
నీ కనుసన్న నా కయిత నెచ్చెలి నిల్చెను దేల్పు మిద్దటిన్.

శ్రీకృష్ణరాయల సేనాని వీరతి
మ్మప్ప యే కులమున కాది మణియొ
మధురనాయకు రాచ మన్ననల్ గాంచిన
వీరప్ప యే కుల విమల మణియొ
నేల నల్గడ గుమల్ నెలకొల్పి మించిన
కొండలరాయఁ డే కులము మణియొ
వైరాగ్యమున రాజ్యపాలన వీడిన
తిమ్మనం దేకుల దివ్యమణియొ



శ్రీమతి అడుసుమిల్లి రాజరాజేశ్వరి

కృతిపతి - సతి

కురవికులము రాణి

యట్టి పెమ్మసాన్యన్వయ మందు వెలసి
నట్టి కొండల రాట్ స్వామి కాత్మజాత
రాజరాజేశ్వరికిఁ గావ్యరమణి సవతి
యై యెసంగె; సుబ్రహ్మణ్య! యాదుకొనుమ!

తన కులీనతలోని వినయ మొజ్జన మాచుఁ
దెలివల నడకల దిద్దుచుండఁ
దన వదాన్యతలీల కనపడ్డ దీనుల
కమృతంపు బావి యై యడరుచుండఁ
దన మందహాసంబు పనివారి యాత్మలు
దనియించు వెన్నెలై దనరుచుండఁ
దన మధురోక్తులు గనవచ్చు కవులకుఁ
గనకాభిషేకమై క్రాలుచుండ

షష్టి పూర్తిని మా మేడ జరుపువార
మయ్య! తెలుఁగురాజా! రాఁగదయ్య! యంచుఁ
దెలుపు రాజరాజేశ్వరీ దేవి మెచ్చి
బాబు! కృతికన్య నిచ్చితిఁ బడయు సుఖము.

త్మానై గీతల బోధచేయు హరి వక్త్రవ్యంబుగా నెంచి "మా

సానాం మార్గశిరోఽహం "మంచనెఁ బ్రశస్తంబైన యీ మాసమం

దే నేఁబుట్టితి నౌట నాకృతిసుతన్ నీకిత్తు నీనాఁడె దు

గ్గా నాగేశ్వరుసాక్షిగాఁ గొనుమి! సుబ్రహ్మణ్యా! పాలింపుమీ!

రాజిలె రామాయణమును

రాజిలె భారతము గూడ రాజుల చరితన్

రాజిలు మన చరితంబును

రాజులమై యుంట సుకవి రాజులలోనన్.

ధవు కులీనత గూర్చి దలఁప నక్కఱలేదు

స ద్దిలీపుని వంశజాతుఁడగుట

పతి భాగ్యమును గూర్చి పలుక నక్కఱ లేదు

పుండ్రేక్షు ఖండ్రికల్ బోలెఁ డుంట

వరు నుజ్జ్వలత గూర్చి వ్యాఖ్య యక్కఱ లేదు

గండరించిన మన్మథుండె యగుట

ప్రియు నుదారత గూర్చి వివరమక్కఱ లేదు

కాయమూనిన కల్పకంబె యగుట

ధార్మికత్వము వైదగ్ధ్య మోర్మి దయయు
సత్త్వ గాంభీర్యములు గల సరసుఁ డగుట
అస్మదీయాంధ్ర కృతికన్య యఖిలమాన్య
యడసుమిల్లి సుబ్రహ్మణ్యు నంక మెక్కె.

నీ పేరు చెప్పిన నెఱిఁ దల వాంచుచు
నే వినోదంబు వీక్షింపఁబోదు
నీ కావ్యగీతికల్ వీఁకమైఁ బాడుచోఁ
బల్లెత్తి పాడదు ప్రకృతిలజ్జ
నీ దర్శనముఁగోరి నిగనిగ బెళుకులు
తళుకుల కనులతోఁ దఱచుచూచు
నీ రాకఁ గనుఁగొని నిలయంబు గైసేసి
శివు శిరో గంగ హసించి మించు

సకల లక్షణ లక్షిత సరళ సరళ
భావకలిత సాలంకార భవ్యకావ్య
కన్యకామణిఁ గవ గూడి కరఁచి మదిని
అడసుమిల్లి సుబ్రహ్మణ్యా! యడరు మోయి!

ఇతి శివమ్

# స్వీకృతి

రాజుగారూ !

మీ రం డ అ కు తెలుఁగు రాజులు, కవిరాజులు. నాకు, నా సోదరీ సోదరులకు, నా కుటుంబమునకు మాత్రము రాజుగారు. రాజుగారు మా కుటుంబములో సహపంక్తిలో చిన్ననాఁటి ఆటపాటలలో చిలిపితనములో అధ్యాపకులలో ఇంటి పెద్దలలో గుఱ్ఱపుస్వారీలో షికారులో అపరాధోపసంహరణలో మా కవి పండితులలో నౌకరు. ఈ నాఁడు సప్తసంతానములలో ఖిలము కాని దానికి ముడిపెట్టినది కూడ వారే. మీ చరిత్రలో మఱపురానివి మీ నూనూఁగు మీసము, మీ కోరపాగ, మీ సిల్కుకోటు, మందహాసము.

మీ యీ కావ్యములోని పురాతన ఘట్టములు నా చిన్ననాఁటి చిలిపిచేష్టలకు దోహదములు.

తణుకులోని మీ గద్య పద్య కావ్య రచనలు, మీ జయపురాస్థాన కవిత, మీ రాజకీయ విశిష్టత, మంత్రుల తోడి మీ మిత్రత జగత్ప్రసిద్ధములు. మీ కవితా యశస్సు దశదిశ విశ్రాంతము. మా బావగారికి మీ యిడిన అంకితములు చిరస్మరణీయములు. మీ రామకృష్ణయశోభూషణము, ఆరాధన, చంపకమాలినీ పరిణయము, కవిత్రయావేదన, రసాలము, ఉత్తర రామ చరిత్ర, తపోభూమి, రత్నసుందరి, ప్రతిజ్ఞలు సుకవి భోజ్యములు.

మీ కీర్తితోపాటు మమ్ము గూడ చిరంజీవులు చేయ నెంచుట మీ యౌదార్యము. అనన్య సామాన్యము, దానికి నే ముగ్ధుఁడను.

సభ్యులారా !

నా కిదియొక మహాసుదినము. అతిశయము కాని యథార్థము. మీరందఱు పండితులు, కవులు, విద్యాప్రవీణులు మీ సమక్షమున నొక యుత్తమ కావ్యము - అందును కవి స్వీయచరిత్రము సంకిత మొందుట జీవితములో నా కొక పరమావధి.

(శ్రీ) తెలుఁగు రాజుగారు ఉత్తమ కవులు. మా కాంధ్రకవితా పితామహుని వంటివారు. దేశభాషలందు తెలుఁగు లెస్స యని చాటించుటకే తెలుఁగు పదము తనరాజశబ్దమునకు ముందుంచుకొనినారు. నేఁటి కావ్యము వారి స్వీయచరిత్ర. తెలుఁగు దనమున కాటపట్టు. మా మా కుటుంబ విషయ సమ్మేళనము ఈ ప్రజాయుగములో కవి తన కథను సంకిత మొనర్చుటయు స్వీకరించుటయు నిదియే ప్రప్రథమము. ఆ యదృష్టము నాకు దక్కినది.

వారి పదలాలిత్యము, భావగాంభీర్యము, రసపోషణము, కథా కథనము, వ్యాకరణ విశిష్టత, అలంకారోపజ్ఞ నా కన్న మీకే విదితము.

మహెూత్తమ కవీ! ఈ మహాంధ్రము ఎంద ఱెందఱో విద్యావంతులకు, విద్వద్రాజులకు, కవి పండిత పోషకులకు ఉనికిపట్టు. వారందఱిలో మీ కృతి నాకిచ్చుట నా యదృష్టము, నా పూర్వపుణ్య ఫలితము. భక్తిపురస్సరముగా మీ కృతి స్వీకరించి ఆంధ్రభాషా యోషా కుంతలముల ముడుతును. నమస్తే !

గుడివాడ
1-1-58

A. V. Subbarao [signature]

ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యులు.

ఓమ్
శ్రీకృష్ణాయ నమః

# తెలుఁగు రాజు

---

వేంకట సుబ్రహ్మణ్యా!
వేంకటపతి చరణభక్త! విద్యాసక్తా!
పంకజభవ తేజస్వీ!
శంకర మందార హీర చంద్రయశస్వీ!

గోదావరీ గంగ కూలంకషంబుగాఁ
ప్రవహించు నేయూరి ప్రక్కనుండి
కనకాంబికాదేవి కాపాడు నేయూర
నివసించు చుండిన నిఖిలజనుల
రాజరాజనరేంద్ర పూజ లేయూరిలో
వేదోక్తరీతిగా వెలయుచుండు
షడ్దర్శనంబు లాసాయంబు నేయూరఁ
బఠన పాఠంబులు పరఁగు చుండు

పండితాకరమ్ము పశ్చిమ గౌతమీ
మండలాంతరాళ మండనంబు
తణుకు లంకసీమఁ దనరు కాఁకరపఱ్ఱు
మామ కీన జన్మభూమి గాఁగ.

మని రచ్చట మా పూర్వులు
ధనంజయ సగోత్రులును వదాన్యులు కాత్యా
యన సూత్రులు శశికులజులు
మనుమార్గము వీడనట్టి మాన్యగుణాఢ్యుల్.

జనులు పెనుమెచ్చ నిరతము
ఘనతర కార్యములు దాముఁ గావించుటచేఁ
బెనుమెచ్చ యింటి పేరును
గొనినా, రదె మాకు నాఁటఁగోలెం జెల్లున్.

మొగలి తుర్తి విభులమ్రోలను వీరులౌ
విజయనగర నృపుల విపుల సభల
ముఖ్యమంత్రులౌచుఁ బొలిచిరి మా పూర్వు
లేలి నారు ర్యాలి నేల, లీల.

విమతుల్ మెచ్చెడి యోధకోటి పొదువన్ పెద్దాపురాధీశ్వరుల్
విమలాకారులు రాఁగ, మీఁగడలతోఁ బింపుల్ మదీంయహాన్వయుల్
తమ్మరై చేయఁగ మెచ్చి వారు నిజ సంస్థానంబునన్ భూములన్
సమ మర్యాద నొసంగఁ బోవునెడ హస్తాల్ చాఁప లేదెవ్వరున్.

ఆ పెద్దాపుర రాజవర్యుల పవిత్రార్యాన్వయోద్భూతులై
శ్రీ పత్యంఘ్రి నవారవింద యుగళీ సేవా పవిత్రాత్ములై
మా పూర్ణాంశులు వత్సవాయి గృహనామంబొప్పు సుక్షత్రియుల్
వే పుణ్యంబులు సేసి పొల్తురెపుడున్ వేడంగియన్ పల్లెలోన్.

శ్రీ రామ లింగ కరుణా
శ్రీ రాజిత కమల షండ చిక్కణ సరసీ
తీరగ వేడంగి పురము
భూరమణీ హారమగుచుఁ బొలుచుచు నుండున్.

వేడంగిలోన నెన్నఁడు
వాడని జలజముల మెఱయు చొక్కపుఁ గొలనన్
వేడుక నీఁదెడు బాతుల
పోఁడుములకు వలచి పూవుబోం డ్లెసకమునన్.

వచ్చిన పని యేమటి తమ
దెచ్చిన బిందియల నీళ్ళ దింపక యెవియో
ముచ్చటల మెలఁగఁ దెరువున
వచ్చెడి గో వాళ్ళ కనుల పండుగ యొదవున్.

వారి ఘటములతో నిజ తీరమందు
మెలఁగెడి విలాసినుల యొప్పుఁ గలయఁజూచు
నబ్జ వనలక్ష్మి సరసాంతరంగ యగుచుఁ
బ్రొద్దుపొడుపులఁ గన్నుఁదమ్ములను విచ్చి.

తామర పూల తావులను దామయి దొంగిలి కమ్మ తెమ్మెరల్
రామల చూర్ణ కుంతలములన్ బలుమాఱులు చక్కనొత్తుచున్
వేమఱు ప్రోఁగఁ జేయు నట వీనుల విందుగ రామలింగుఁడన్
స్వామి గృహంబు ముందుగల స్వర్ణపతాకను గల్గు ఘంటికల్.

రామలింగేశు కోవెల ప్రక్కనున్న
వీధికావలి భాగాన వెలయుచుండు
సూర్య కులజుండు వత్సవాయ్ సుబ్బరాజు
నింటి మోసాల నేను జన్మించి నాఁడ.

ఆతఁడు మాతామహుఁడ
త్యాతత సత్కీర్తియుతుఁడు న్యాయాత్ముండున్
పూత చరిత్రుండని వి
ఖ్యాతిం గనినాఁడు నాఁటి క్షత్రియులందున్.

* అది వికారి సంవత్సరమందు మార్గ
శీర్ష బహుళ చతుర్థి బుధా ర్షదినము;
పుష్యమీ ఋక్షమునయందుఁ బుట్టినాఁడఁ
దల్లి పుట్టింట బందుగు లుల్లసిల్ల.

లేఁగ దూడలు పాలకై లాఁగు లాడు
చార్చుచుండంగఁ బ్రేమ నంబా యటంచు,
పుష్యమీ ఋక్షకలితమై పొలుచు మేష
లగ్నమున ననుఁగనె తల్లి రాఘవాంబ.

పుట్టినవేళ బ్రాహ్మణు లపూర్వముగాఁ బఠియించి వేదముల్
కొట్టిరి ఘంటికల్ మొరయ గోపతివాహను మందిరంబునన్
జుట్టును నున్న జంగములు చొక్కుచు నూఁదిరి శంఖరాజముల్
కొట్టిరి నారికేళములు కోమల గాత్రలు శర్వు మ్రొక్కుచున్.

* 1899 డిశంబరు 20.

వేదనినాదముల్ చెవుల విందుగ, సంకుల సంకులార్భటుల్
ఆదటఁ గూర్పఁగాఁ బురిటి యాలయమందలి నాదు తల్లి స
మ్మోదముఁజెందె నా ధ్వనులు పుత్రుని వృద్ధికిఁ గారణంబుగా
మీఁదిది యెల్ల భాగ్యమని మిక్కిలి పొంగిరి బంధువర్గముల్.

మాతామహి వేంకాంబిక
కూఁతున్ దౌహిత్రు గాంచి కుతుకం బడరన్
సూతాశౌచము తొలఁగఁగ
జాతకమును లేఖ నాదు జనకున కనిపెన్.

కాఁకరపఱ్ఱు నా జనకు గ్రామము గావుట మంగళాతఁ డా
లేకను జేతఁబట్టుకొని లేడి వలెన్ బరుగెత్తి ప్రొద్దు తాఁ
గూఁకక మున్న యచ్చటి కకుంఠితశక్తినిఁ బోయి యిచ్చె నా
లేకను నీలమాంబ యను లేమకు నాదగు నాయనమ్మకున్.

పౌత్రజననలేఖ పఠియించి నీలాంబ
మిన్నుముట్టి వాని కన్న మిడియె
వెడలి వచ్చె పొలము, వేంకటపతిరాజు
నన్నుఁ గన్నతండ్రి; నాయనమయు.

నాదు జననవార్త యాదరంబునఁ దెల్ప
సంతసించి తండ్రి స్వాంతమందు
కట్నమిచ్చి పంపెఁ గ్రన్నన మంగలి,
నతఁడు హర్షమంది యరిగినాఁడు.

ఇరువది యొకటవ రోజున
నరుదెంచిరి నాయనమయు నయ్యయుఁ జుట్టల్
ఇరుగున పొరుగున వారలు
నరుదగు నా బారసాల నరసెడు వేడ్కన్.

ఉదయంబుననె వచ్చి యుర్వీసుపర్వుండు
విఘ్నేశు నర్చించి పేరుపెట్టె
నోజ లక్ష్మీపతి రాజటంచును నాకుఁ
దండ్రితండ్రిని సదా తలఁచు కొఱకు;
ఆ పేరు పెట్టుట కానందమును జెంది
మంచి కానుకల నిచ్చె మామ్మగారు
చుట్టాలు పక్కాలు చూచి నా ముక్కును
మొగము ననిరి తల్లి పోల్కివాఁడు

చాలగ నదృష్టవంతుఁడై జాతికెల్లఁ
బేరుకీర్తులు దెచ్చు విస్తార విద్య
లార్జనము చేయునంచు నత్యాదరమునఁ
జుట్టునున్ మూఁగి సంతోష ముట్టిపడఁగ.

వదనమా యిదిగాదు పర్వచంద్రుఁడు గాని
మెట్లు సృజించెనో యిది విరించి
ఫాలమా యిదికాదు బాలేందుకళ గాని
మెట్లు సృజించెనో యిది విరించి
కన్నులా యివిగావు కలువరేకులుగాని
మెట్లు సృజించెనో యివి విరించి
నాసికా యిదికాదు నవ్వు సువ్వువ్వుగాని
మెట్లు సృజించెనో యిది విరించి

కాయ మిదిగాదు బంగారు కణికగాని
యంచు ననుఁగాంచి కొనియాడి రతివలెల్ల
నాయనమ్మయు నమ్మమ్మ నవ్వుకొనిరి
మురిసి ముద్దాడె మాతల్లి బుగ్గపుడికి.

నాల్గు రోజులచట నాతండ్రి మామ్మయు
సంతసమునఁ గడపి సొంతయూరి
కరిగినారు నాకు నభివృద్ధిఁ గోరుచు
రామలింగదేవుఁ బ్రస్తుతించి.

భారత సావిత్రి పఠియించి భక్తితో
నుగ్గును బట్టించు నొక్కపూఁట
నరసింహ శతకంబు నోరిమతోఁ బఠియించి
పాలిచ్చు చుండును లీలతోడ
భారత పద్యముల్ పఠియించి తియ్యగాఁ
గరక గంధంబిడు నరుగఁదీసి
రామాయణంబు నురక్తిమై బఠియించి
దుంపరాష్ట్రం బిడు రొంప తగ్గ

అష్ట పదులను బాడుచు నంటు తలను,
గీత గానంబు చేయుచు భూతిపెట్టు
నన్నుఁగన్నమ్మ నావృద్ధి నెన్నికొనుచు
నాదు కవనమ్మునకవి పునాదులయ్యె.

పొత్తిళ్ళలో నేను బోకారు చుండగాఁ
నానందమునఁ బట్టి యాడుచుండు
దేఁకుచుఁ మెల్లఁగాఁ బ్రాఁకుచు నుండఁగాఁ
బడి పోదునని చేతఁబట్టుచుండు
తప్పటడ్గులు వేసి తడఁబడు చుండఁగా
నల్లారు ముద్దుగా నత్తుకొనును
చిలిపి యల్లరులను జేయుచు నుండఁగాఁ
దప్పు నాన్నా ! యని చెప్పు బుద్ధి

గోరు ముద్దలు తినిపించు నోరు తనియఁ
జంక నిడుకొని కథలను జాలఁజెప్పు
జోలలను బాడి జోకొట్టి చొక్కఁచుండు
నన్ని భాగ్యాలు నేనెకాఁ గన్నతల్లి.

తన యందము నా మొగమునఁ
గనుగొంచును నాదు తల్లి కన్నులు దనియన్
మనమున ననయము పొంగును
వనితలఁ దొలుకాన్పు లెంత వలపించునోకో!

శుక్ల పక్ష చంద్రుని వలె సొరిది నేను
దినదినంబును నభివృద్ధిఁ గనుచు నుండ
నాయనమ్మ కాఁకరపల్లునకును నన్నుఁ
బంప వలసినదని కమ్మ వ్రాసి యనిపె.

మాతామహి యా లేఖను
మాతకుఁ జూపించి మేనమామల యాజ్ఞన్
మా తండ్రి గృహమ్మునకున్
నా తలి ననుఁ బంపఁగ జతనము గావించెన్.

చలిమిరి మోదకములు జ
క్కిలములు నుక్కెరలు నాది కేలుంగాలున్
నలిగులిగ నిరుగు పొరుగ
మ్మలు చేసిరి యెల్లి పయనమని తొడిబడుచున్.

వేఁగుటకు మున్న పయనమై యేఁగవలయు
నంతలో ముంచుకొనివచ్చె ననిల రోగ
మాడ దూపిరి, కనురెప్ప లాడవయ్యెఁ
దల్లియును, మామ్మ ననుఁగాంచి గొల్లుమనిరి.

ఇఁక లాభములేదని యెల్లవారుఁ
బెదవి విఱువ మాతామహి యెదఁ గలంఁగి
చంక నిడుకొని నను గొడ్లసాలఁ జేర్చె
నట్టులే యుంటి నేనొక యాఱునాళ్ళు.

వచ్చెడి పోయెడి యూపిరి
నిచ్చలు నేనట్లయుండ నెంజెలి పడుచున్
బచ్చి జలంబులు ముట్టక
ముచ్చెమటలు పోసి తల్లి పొక్కుచు నుండన్.

యాయవారమ్ము చేయఁగా నరుగుదెంచి
మానవాకృతిఁ గొన్న (శ్రీ) మాధవుండు
రాగరహితుండు జ్ఞాని బైరాగి యొకఁడు
వీది గుమ్మము కడ శంఖ మూఁది నాఁడు.

చిందపు ధ్వని విని మాయమ
ముందరి కరుదెంచి వాని మ్రొక్కఁగ నతఁడున్
"దొందరలేదో యమ్మా!
నందనునకు వేఁకి యడఁగు నలఁతయుఁ దొలఁగున్."

"ఏఁడి! నీ బిడ్డ చూపింపు మేష్వఁ బోకు
మంచు లోనికి నరుదెంచి మంచమందు
నున్న ననుఁగాంచి సంచిలో నున్నదేదియొ
తీసి మంత్రించి నా పైని పోసినాఁడు.

పోసెనో లేదో వెంటనే మూసియున్న
నోరు తెఱచి నే నేడ్చితి బోరు మనుచుఁ
దల్లి యుల్లము విలసిల్లెఁ దల్లితల్లి
యెల్లవారును బైరాగి కాళ్ళఁ బడిరి.

సంగరహితుఁడౌ బైరాగియుం గరంబు
తోడ నా మేను సవరించి తుడిచి వైచె
వేరువెల్లంకు లేవియో వెలుపలకును,
అదియె సమయాన నేను గ్రక్కదలినాను.

కొంతసేపట్లు కదలగా సంతసించి
తల్లి యొడిఁ జేర్చెఁ జనుఁబాలు మెల్లమెల్లఁ
జప్పరించితిఁ జేతుల నప్పళించి
కన్నవారెల్ల బైరాగి మిన్న నెన్న.

నేనట్లు పాలు త్రావఁగ
మానిని మాతల్లి యపుడు మస్కారి పదముల్
చేనంటి మ్రొక్కి భక్తిన్
వేనోళ్లను బొగడి కాన్క వెట్టఁగఁ బోవన్.

"వలదమ్మా నాకుం గా
న్కలు, నీ పున్నెములపంట కాఁగలఁడమ్మా!
కుల ముద్ధరించు నాతఁడు
దెలుఁగున్ గవిరాజు సుజనదేశికవరుఁడున్.

ఇరువదేఁడుల కీతఁడుఁ గురువు కరుణ
సంస్కృతాంధ్రాల రెండింట సరస కవిత
చెప్పి మెప్పించును రసజ్ఞ శేఖరులను
రాజ సన్మానములఁ గాంచు రాఘవాంబ.

మాయురె! నీకుమారుఁడతి మాత్ర కవిత్వ మహత్వ సంపదన్
మీ యిలు నుద్ధరించు వినుమీ యిఁక వీనిని నీవు సత్యనా
రాయణ రాజనామమున నన్నవరంబున నున్న సత్యనా
రాయణు పేరితో పిలువు మయ్యది వీనికి వృద్ధి హేతువౌ.

పొలము పనులకుఁ బనుపక పొలఁతి వీనిఁ
జదువఁ బెట్టుము సురభాష జానుఁదెలుఁగు;
వంశదీపకుఁ డీతఁడు సంశయంబు
వలదు నమ్ముము నా మాట కలికి మిన్న.

ఇతఁడు చేయందఁగానె మీ యింట నున్న
లోటుపాటులు సర్వము మాటు పడును
సిరియు సంపద తులఁదూఁగు సరసులైన
సచివరాజుల సాహాయ్య సరణిఁ జేసి.

తన మధుర వాక్కు చేతను
తన కవితాశక్తి చేత ధరణీ ధవులన్
జనులను మంత్రుల నీతఁడు
దన వశ మొనరించు కొంచుఁ దనరును తల్లీ!"

అంచు వచియించి బైరాగి యరిగినాఁడు
దమ్మిడీయైనఁ గొనలేదు దాహమైనఁ
బుచ్చుకొనకుండ మింటిపైఁ బ్రొద్దుఁ గనుచు
నిచ్చవచ్చినయట్లు లెయ్యేని నెడకు.

కొన్ని నాళ్ళకు నేఁ గోలుకొనిన వెంటఁ
గారవల్లికి వచ్చె నా కన్నతల్లి
చంక దింపక యెన్నఁడు సాకె నన్ను
మ త్పితామహి నీలాంబ మమతతోడ.

మూఁడు మండువాలందును మొదటి యిల్లు
ఆదినుండియు మా కాణయాచి యగుట
ఇరువదేడుల వయసు నా కేఁగు దెంచు
దనుక నందే మెలంగితిఁ దండ్రి యొద్ద.

అయిదవ యేఁటనె నన్నును
నయవారికి నప్పఁజెప్పి రాంధ్రము గఱపన్
నయమున నాల్గేడులకే
నయిదవ తరగతిని విజయమందితి నంతన్.

సంస్కృతమ్ము నేర్వ చర్ల నారాయణ
శాస్త్రివరుని కడకు జనకుఁ డంపె
శాస్త్రిమణియు నన్ను సాహిత్య వీధులన్
నందనోపవనుల యందుఁ ద్రిప్పి.

కాళిదాసత్రయ కల్హారముల లోని
తేనె బొట్టులు కొన్ని యానఁజేసి
భారవి మాఘుల భవ్య కావ్య కుసుమ
నవ పరిమళము లానంగఁ జేసి
శ్రీహర్షు నైషధ శ్రీ విలాసమ్ముల
హేలలలో విహరింపఁ జేసి
నాటక రస ధునీ నవభావ వీచుల
నానందమున నోల లాడఁజేసి

యుభయ శాస్త్రము లీదించి యొడ్డుఁజేర్చి
తెలుఁగుఁ గైతల మెఱుఁగులఁ దీర్చి దిద్ది
యింతవానిగ నన్నుఁగావించి నాఁడు
శబ్దశాస్త్ర నారాయణశాస్త్రి గురుఁడు.

గురులచెంత వాగ్దేవినిఁ గొలుచుకొంచు
నలవసుంధరాదేవి సేవానురక్తి
ఉజ్జగింపక జనకుని యొజ్జనమునఁ
బొలము పనిపాటులందేను మెలఁగుచుంటి.

ఉత్తరమున గోదావరి హత్తి పాఱు
నివల లోతట్టునను బాఱు నేటి కాల్వ
ఏటి కాలువలోనుండి యేఁగు మఱుగుఁ
గాల్వలోఁ జేరును మఱొక్క కాల్వ వచ్చి.

మూఁడు కాల్వల మధ్యగా మారిఁబోవు
జాంగల స్థలి మాయూరు జెంగలించుఁ
బండితాఖండులకు నది మండపంబు
అరుగు నరుగును విశ్వవిద్యాలయంబు.

చర్ల నారాయణ శాస్త్రి గేహమ్మున
శాస్త్రముల్ కొందఱు చదువుచుండ
భాష్యకారుల యింట భాష్యముల్ కొందఱు
సర్వదా చర్చలు సలుపుచుండ
తర్క వేదాంతముల్ తర్కించి కొందఱు
గౌరీపతి బుధుతో గడన చేయ
పెద్ద సీతారామ విబుధేంద్రు సన్నిధి
సాహితి కొందఱార్జనము చేయ

నందటికిఁ గూడఁ దమయింట నన్నమిడుచు
నాదరించిన యట్టి యవ్యాజభావు
లయిన యా పండితాలికి నాంధ్రదేశ
మెల్ల ఋణపడి యుండు నెన్నేళ్ళకేని.

ఆ సాయంబును శిష్య సంతతికి నత్యంతానురాగంబుతో
వీసం బేనియు ప్రాలుమాలక మహా విజ్ఞానులం జేయఁగాఁ
బైసా కోరక పాఠముల్ నుడువు నా బ్రాహ్మణ్య గణ్యప్రభన్
ఏ సూరుల్ గణియింపకుంద్రు? మదులన్ హేరాళసద్భక్తితోన్.

మిట్టు పల్లాల వీధుల మేడ మిద్దె
లడర మా యూరు సొబగారు నన్నిగతులఁ
బైరు పచ్చలు కన్నుల పండువౌను
గ్రోంతి గ్రొమ్మచ్చు లాడును గ్రోఁతులచట.

కొట్టయెన్నుల ముక్కులఁ గొటికి పట్టి
చిలుక తండాలు మింటిపైఁ జెలఁగి యెగురుఁ
బావురమ్ములు గొట్టును బల్లటీలు
ప్రకృతి భాగ్యాన కా యూరుఁ బట్టుఁగొమ్మ.

ఊరి కొక మూలగానుండు నుత్తరమున
రాచనగళుల యందుండు రాచవారు
మన్మథాకారు లగణిత మానధనులు
మేటి పెత్తనదారు లా పాటి కెల్ల.

చిన్న తగవైన రాచకచేరి కడన
తీరవలెఁగాని యొండెడ దీరదెపుడు
పంచ జనములు నా రాచవారి మాట
ముల్లె మూటగఁ దలదాల్తు రెల్ల యపుడు.

రాచవారందఱును నిజ ప్రాభవమ్మొ
మెఱయఁ బనిపాటువాండ్ర మేలరయు చంద్ర
లోకు లీతండ యుత్తమ శ్లోకుఁడనఁగ
సాటివారల మేటియై జనకుఁ డలరె.

ఆయము లెక్కచూడక యె యర్థము సాహులచెంతఁ దెచ్చి మా
నాయన కర్సెనమ్మున ననారతమున్ శ్రమియించుచెంతయున్
గాయము గస్తిపెట్టుటలు గాంచి పితామహి నేయి బూదిలోఁ
బోయుటయయ్యె నాకొఱకు పోఁడిమియంచిటులాడెఁదండ్రితో.

"నీవు కడుపున బడ్డ యాఱ్నెలల కీల్గె
నీకు జనకుండను నాయనా! నేను నిన్నుఁ
గాంచి పెంచి పెద్దగఁ జేసి కానియేని
ఋణము లేకుండఁ బొల మప్పగించినాను.

బావగారలు పెట్టిన బాధలోర్చి
పుస్తె తాకట్టుపెట్టి యీ పొలము నిల్పి
పెత్తనంబును నీ చేతఁ బెట్టినాను
బలుకుబడికంచు లంకలు పాడినావు.

పెద్దపిల్ల సుభద్రకుఁ బెండ్లి చేసి
నావు బార్బ్యారుగా ధన నష్ట మోర్చి
ఆత్మజలు ముగ్గురున్ ముగ్గు రాత్మజులును
పెండ్లికై యింక నున్నారు వెనుకఁ గనుము.

కష్టపడెదవు తినవు సకాలమునను
చెడ్డపని యొక్కటైనను జేయఁబోవు
ఏమి లాభము నాయనా! భూమి నమ్మి
నీవు పడు పాట్లు ఫలియింప నేరవయ్యొ."

అనుడు మా తండ్రి తల్లితో ననియె నిట్లు
"కందియును, నువ్వు బుడమయు నంది వచ్చు
జొన్నయుఁ బాగాకు బాగుగా నున్నవమ్మ!
ఋణము లన్నియు తీరు నీ యేఁటియందు."

అనిన విని నాయనమ్మ మాటాడ దయ్యె
కడుపుతీపికి నద్ది తార్కాణయయ్యె
కార్తెలన్నింట వాన సకాలమందుఁ
బడుట పంటలు బాగుగాఁ బండె నపుడు.

ఇంటి లోపల వెలుపల నెల్లకడల
గాదులనుఁ బుట్లను నిండుగాఁ గొలుచులు
నువ్వులును గందులును గూడ నివ్వటిల్లె
అమ్మ యది యప్పుతీర్చగా నయ్యె తలఁచె.

తా నొకటి తలఁప దైవము
తా నొక్కటి తలఁచుననుట తథ్యము కాఁగా
మా నాన్నశిరమునన్ గా
లూనిన శనికతన దల్లి యొక్కదినమునన్.

వండుచుండెఁ బకోడీలు మండుటెండ
నూనెలో నీళ్ళుపడుట నా నూనె భగ్గు
రంచు మండె మంటలు లేచి యంటుకొనియె
మండువాయిల్లు సర్వము మండిపోయె.

జనుప చేలను గోయింపఁ జనిన నేను
గన్న తండ్రియు నిలుచేరి గాంచినాము
బూది రాసుల; వెంటనే బోరుమంటి
మమ్మ, మాయమ్మయుఁ దోఁబుట్టు లందఱమును.

ధైర్యమూఁతగా మా తండ్రి తడయకుండఁ
బెంకుటిల్లును గట్టించి పెండ్లి చేసె
నా స్వసకు నీలమాంబకు, నన్ను వడుగు
చేసె గృహప్రవేశము నాఁడె చిన్ననాఁట.

మెఱపు తీవకన్న మేలిమి కన్నను
మిన్నయైన మేని ప్రసన్నఁదనము
కలిగి నాదు చెల్లి వెలిఁగెను నీలాంబ
పదియు రెండు నేండ్ల ప్రాయమందు.

నడచినంత మేర నా చెల్లి నేలను
గనకమయము చేయు ననుట చాలు
ఆమె రమకు నీడొ యామెకు రమ యీడొ
నిర్ణయింపలేరు నిపుణమతులు.

దీపకలిక యహాచు దీపించు చెల్లెలి
కింటి కడను చదువు లెఱుఁగఁ జేయు
చమ్మ కనుచు నుండు నంతలోఁ జెల్లెలి
కర్మ మొక్కసారి కాలిపోయె.

బొట్టు చెరిగిపోయెఁ బోయెను గాజులు
నెత్తి నోరు గూడ మొత్తికొనుచుఁ
గంటి ధార లురల నింటిల్లిపాదియు
వెక్కి వెక్కి యేడ్చి రొక్కమొగిని.

చెల్లిమొగము గాంచి చెయి చాఁపి ననుఁజీరి
వనరినట్టి యమ్మ వదనమిపుడు
నాదు కనులలోన నడయాడుచున్నది
యింతకంటె దీని నేమి వ్రాఁతు.

అన్నము పున్నము నెఱుఁగని
పిన్నది నీలమ్మ తనదు విధి నెఱుఁగకయే
మున్నిటివలెనే తిరుగుచు
నున్నది మేమెల్లఁగుముల నుల్లములందున్.

పెద్దతల్లిగారు సిద్ధాంతమున నుండి
వచ్చి నాదు తల్లి బాధ నుడివి
చెల్లి నీల సుతగఁ జేకొని తోకొని
వెడలె సంతులేని వెలితి తీర.

అప్పు లెక్కువాయె నమ్మపుస్తెను గూడఁ
గుదువఁ బెట్టినారు తుదకుఁ బితలు
ఏమి వ్రాఁతు నాఁటి లేమిబాధను గూర్చి
యెడద బెడద గుండె లడలు చుండ.

అధిక వర్షాలు యుద్ధము లపుడె వచ్చెఁ
దిండి గింజల కంట్రోళ్ళు దండి యయ్యె
అప్పు నరువును తండులా లబ్బవయ్యె
మమ్ము మా తండ్రి యెట్టుల మనిచెనో

ఎన్ని కష్టాలు పడుచున్న నాన్న నన్నుఁ
జదువు మాన్పింపఁగాలేదు చర్లవంశ
చంద్రుఁడైన నారాయణ శాస్త్రివరులు
జ్ఞాన భిక్షనుబెట్టి నన్ సాకిరపుడు.

ప్రొద్దు మొగ మెఱుఁగని మాతృమూర్తి నాదు
కవనశక్తిని సాహితీగరిమ గాంచి
భావి భాగ్యంబు దలఁచుచు బ్రతుకు చుండె
నార్థికములైన చింతల నతకరించి.

తాతలు భూమి విప్రుల కుదారత దానము చేసినట్టి వి
ఖ్యాత చరిత్రులౌర! కనినయ్యయు నట్టిడ నైననేమి మా
వ్రాఁతలు దుర్విపాక ఫల భాక్కులు గావుట మాన్యమంతయున్
నా తల మెత్తునాఁటికె బుణంబుల పాలయి పోయె నక్కటా!

చిన్న మేనమామ మున్ను నేఁ బుట్టిన
యపుడు పిల్లనిత్తు ననుచుఁ బల్కి
యాస్తి పోవఁగానె యామాట తప్పినాఁ
డమ్మ దాని కేమి యనఁగలేదు.

పెద్దతల్లి, భర్త సిద్ధాంతమున నుండి
చెల్లి నీలమాంబ చెంత నిడుక
యరుగుదెంచి రంత నక్కయు బావయు
వచ్చినారు మాదు వసతి కపుడె.

ఎల్లవారు గూడి యేమి యోచించిరో
యెఱుఁగఁ జాలఁ గాని యేఁగెఁ దాను
బెద్దతండ్రిగారు వేడంగి పురికిని
మగిడి వచ్చె నాఁటి మాపటికిని.

వచ్చిన కొంతసేపటికి వచ్చెను మా పెద మేనమామ యా
వచ్చిన బండిఁ దత్సుత సుభద్రను గూడను దోడితెచ్చె నా
కచ్ఛపలాయతాక్షి సతియయ్యెను నాఁటనె నాకు నెయ్యముల్
ముచ్చికమైఁ గరంచె నను మంజుల వాక్కుల రమ్యచేష్టలన్.

తల్లి లేని నాదు నిల్లాలి నా తల్లి
చేతఁబెట్టి యొప్పఁజెప్పి వెడలె
మేనమామగారు; నేను నుద్యోగంబు
కొఱకుఁ దలఁచు వెదకికొనుచు నుంటి.

అంత ప్రకటన యొక టాంధ్రపత్రికయందుఁ
బ్రచురమయ్యెఁ గనుల పండువగుచుఁ
గోవిదుం డొకండు గుడివాడ హైస్కూలు
నకును గావలెనని; యొక గడియకు.

గురుఁడు కబురు పెట్టి గొబ్బున రమ్మని
వెడలినాఁడ భక్తి కడలు గొనఁగఁ
గూరుచుండఁ బెట్టి గుడివాడ సంగతి
గురుఁడు చెప్పె డబ్బు గూడ నిచ్చె.

వెడలి రమ్ము రాజు వేగమే గుడివాడ
భయము లేదు రేఖ బయట పడును
పద్యములు రచించి పాఠశాలాధిపు
గాంచనేఁగు మతఁడు గను ముదమ్ము.

అల్లి పద్యమాల యగుపర్చి గురువున
కమ్మ కంజలించి యరుగు దెంచి
జల్లి కాకినాడ మెల్లఁగాఁ జేరితి
నొక సిఫార్సు కొఱకు నుత్సుకతను.

జానకిరామరాజనెడు చారుగుణాఢ్యుఁడు నన్ను మిక్కిలిన్
మానిత పుత్రభావమున మక్కువఁ జూపియు డబ్బునిచ్చియున్
దా నొకలేఖ వ్రాసి తన దగ్గఱి చుట్టము బాపిరాజుకున్
జే, నను దట్టి పంపెఁ గడుశీఘ్రముగాఁ జిఱునవ్వు మోముతో.

తివిరి యాలేఖ తోడఁ బత్తే పురంబుఁ
జేరి యచ్చట తా మసూచికము తోడఁ
బడిన చింతలపాటి (శ్రీ) బాపిరాజు
గారి దర్శన మొనరించి కమ్మ నీయ.

ఆతఁ డద్దాని గాంచి యత్యాదరమున
వెంటనే యొక్క లేఖను పెద్దిరాజు
గారికిని వ్రాసి నా కిచ్చి వారి గాంచి
తన యొసంగిన పత్ర మిమ్మనుచుఁ బలికె.

చని నే నేలూరునకును
ఘనుఁడగు (శ్రీ) బాపిరాజుగారి సులేఖన్
పెనుమెచ్చ పెద్దిరాజున
కు నిడితి ప్లీడరగు నతఁడు కూరిమితోడన్.

బండి శ్రీహరి రావను ప్రాణసఖున
కొక సిఫారసు లేఖను వ్రాసి యొసఁగినాఁడు
దాని గైకొని నే, మోద మాన మాన
సంబునన్ గుడివాడకుఁ జనితి నాఁడె.

బండి శ్రీహరి రావు నా వచ్చినట్టి
పనిని దా విని కని సఖు వ్రాయసంబు
హృద్యుఁ డగుటను దరఖాస్తు పద్యములను
చదువు మనె నన్ను నే నిట్లు చదివినాఁడ.

ఓ కరుణాతరంగ కలితోదధి దీనదయాళు సేవధీ,
కాఁకర పఱ్ఱు నాఁగ నొక గ్రామము రాజిలుచుండు తెణ్కుతా
లూకునఁ బండితప్రతతులుం గలరందు ద్వితీయకాశి నాఁ
జేకురె దాన నొక్క ప్రథ చెప్పక చెప్పెడు చూచువారికిన్.

మాకు నివాస మయ్యది శ్రమంబొనరించితి సంస్కృతాంధ్రభా
షాకలనంబులం దుభయశాస్త్రములందును గొంత కొంతగా
సాకతమైన చర్లకుల చంద్రునితోడ మదీయ గ్రామమం
దే, కులమందు క్షత్రియుఁడ నేనిట నున్నత పాఠశాలలోఁ

దేఁకువ నిర్వహింపఁగ సుధీపద మర్మిలి వచ్చి నిల్చితిన్
మేకొని నాదు విన్నపము మీరు ఫలింపఁగఁజేయ వేఁడెదన్
నా కవితా లతాంగి నిడినాఁడను మీకిదె యెట్టు లేలెదో
ప్రాకట సత్కవీంద్ర పరిపాలక! శ్రీహరిరావు నాయకా!

విని నా పద్యము లంతరంగ ముఖుకం బ్రేమాతిరేకంబునన్
నను సన్మానముతోడఁగాంచి యిడె విన్నాణంబు మై నార్డరున్
చని నే నార్డరుతోడ జాయ నయితిన్ హైస్కూలులో వెంటనే
కని హెడ్మాష్టరు క్లాసులోఁగఱపు నా కావ్యార్థ సందర్భముల్.

"హితుఁడౌ చతుర వచోనిధి
వతుల పురాణాగమేతిహాస కథార్థ
స్మృతియుతుఁడ" వనెడు చోటన్
స్మృతికిని జ్ఞాపకమని యపుడే నర్థమనన్.

కాదు స్మృతులని యాతఁడు వాదు సలిపి
పండితుల నెల్ల రావించి పిండితార్థ
మెఱుఁగఁ గోరఁగ వారెల్ల నేకరీతి
నను మతించిరి నా యర్థ మర్హ మంచు.

---

* 1920 ఆగష్టు 2.

జయము చేకూరె సాహితీ జైత్రయాత్ర
నాఁడు గుడివాడలోఁ దొల్త; నాఁటి నుండి
పెద్దయయవారు నాయెడఁ దద్దకూర్మి
నెరపె నానాఁట ఘనతయుఁ బెరిఁగె నాకు.

తరుణ శశాంక మండల నిధాన మనందగు నిండుమోముతో
అరవిరి మల్లెపూల నపహాసము చేసెడు సుస్మితంబుతో
వరిమడి నారు పోసినటు వచ్చుచు నుండిన మీసకట్టుతో
సరిగ గులాబిరంగుల పసందుల చిందెడు కోటుపాగతో

విరిసిన బంతిపూవువలె వెల్గుచు నుండిన సిల్కుకోటుతో
సురుచిర శుభ్ర దీధితులఁ జుంగులు వాఱెడు పంచెకట్టుతో
నిరువది యేండ్ల ప్రాయమున నే గుడివాడను దెల్గుటొజ్జగా
నరుసము తోడఁజేరి మురియంగను జేసితి శిష్యవర్గమున్.

కలిపితి సత్కవిత్వమును గావ్యము లల్లుట నేర్పినాఁడ నా
కలిపిన వారిలోఁ బ్రతిభ గాంచిరి [1] వేంకట రత్నమున్ సుధీ
వరుడగు నట్టి [2] సూరి భగవంతము [3] నారల వేంకటేశ్వరుల్
వరకవనంబె నా బ్రతుకు బాటకు వెల్గును జూపెఁ బిమ్మటన్.

---

1. శ్రీ తుమ్మలపల్లి వేంకటరత్నము, గుడివాడ.
2. శ్రీ డాక్టర్ సూరి భగవంతము, వైస్ ఛాన్సిలర్, ఉస్మానియా విశ్వ విద్యాలయము, హైదరాబాద్.
3. శ్రీ నారల వేంకటేశ్వరరావు, ఎడిటర్ – ఆంధ్రప్రభ – మెద్రాసు.

అడుసుమిల్లి గోపాల కృష్ణయ్యగారి
చెలిమి లభియించె లేములు దొలఁగఁజొచ్చె
వారి మేడనే నేనుంటి; భార్యతోడ
నాకడకు వచ్చిచేరెను నాయనమయు.

లక్ష్మీనరసాంబిక తన
లక్ష్మిగ గోపాలకృష్ణ రత్నము ప్రజలన్
లక్ష్మీశుఁ డౌచుఁ గాచుచు
లక్ష్మము లేనట్టి చరితఁ బ్రణుతిన్ గనుచున్.

వేంకట సుబ్రహ్మణ్యము
వేంకటపతి భక్తుఁడైన విశ్వేశ్వరుఁడున్
పంకజముఖి దుర్గాంబయు
జింక కనుఁగవ గలదియగు చిట్టెమయు ననన్.

చెలఁగు కొడుకులు కూఁతులు గలిగి యడుసు
మిల్లి గోపాలకృష్ణయ్య యుల్లసిల్లుఁ
బాఁడి పంటయుఁ దనయింటఁ బరిఢవిల్ల
బంధు మిత్రుల సందడి బంధురముగ.

పెద్దబాబటంచు పెద్దపుత్రుండును
చిన్నబాబు నాఁగఁ జిన్నసుతుఁడుఁ
బరఁగఁ బెద్దపుత్రి బాయమ్మ యనియును
ముద్దు పేర్లతోడఁ బొలిచి రపుడు.

పెద్దబాబు నాదు నొద్దనే సతతంబు
నాడుకొనుచు మఱియుఁ బాడుకొనుచుఁ
జదువుకొనుచుఁ జాల జనువుగా నుండెను
చిన్నబాబు చాలఁ జిన్నవాఁడు.

తల్లి దుర్గాంబ సంస్కృతాంధ్రములు రెండు
శ్రద్ధతోడను నాయొద్దఁ జదివి విదుషి
యాయెఁ జిన్నారి పొన్నారి ప్రాయమందె
తెలివి తేటలు కళలతోఁ దెలుఁగు మీఱె.

సైకిలెక్కుట గుఱ్ఱపు స్వారి చేఁత
నేర్చుకొంటిని గుడివాడఁ జేర్చి నేను
బాబు నాతోడునీడగా వచ్చుచుండఁ
జింతఁడను తేజికాపరి చెంతనుండ.

బంగరు సలాక మేనులు రంగు లీన
నేను బాబును హైస్కూలు కేఁగునపుడు
కన్న వారెల్ల మమ్ముల నన్నదమ్ము
లంచు వాకొంచుఁ గడు గారవించువారు.

ఆయెడ నాంధ్ర సత్కవిత నల్లఁగఁజాలిన అడ్సుమల్లి నా
రాయణరావు మిత్రుఁడయి యాంగ్లము నేర్పుచునుండె మేడపై
మాయని శ్రద్ధతోడ మము మక్కువతోఁ గనిపెట్టిచూచుచున్
మాయురె! వాని చైదములు మన్ననకెక్కును నాఁడు నేఁడునున్.

ఒక్క యేఁడాది మేడపై నుండి నేను
గాఁపురము నకు నది యిమ్ముగాఁమి నెఱేఁగి
మందపాటికిని మకాము మార్చినాఁడ;
అడుసుమల్లి గోపాలకృష్ణయ్యగారు.

అను దినంబును నచ్చటి కరుగు దెంచి
అరయుచుండిరి మా క్షేమ మధికకరుణ
పాలు పెరుఁగులు నిరతంబు పంపుచుండ్రి
నన్ను పుత్ర భావమ్ముతో నెన్నుచుండ్రి.

ఎల్ల వేళల మేడ కే నేగుదేర
బాబు చంకెక్కు చుండెడు వాఁడు నాఁడు
ఏను ముద్దాడి యాడించి యెఱుకఁ దెలిపి
బడికిఁ దోకొని వచ్చెడివాఁడ నపుడు.

కన్యకామణి దుర్గాంబ కళలఁ దేఱి
వెలఁగపూఁడింటిపేరితో వెలయునట్టి
రామకృష్ణ ఐ. సీ. యసు రమణి యయ్యె
భావి మద్భాగ్యమున కామె బాట చూపె.

ఆశు కవితల నల్లుచు వ్యాసములను
పత్రికల కెల్ల వ్రాయుచుఁ బండితాళి
మెప్పుఁ గనఁదొడఁగితి మెల్లమెల్లఁగాను
దెలుఁగు నేలను నా పేరు వెలయఁజొచ్చె.

చిన్న పెద్ద లనక శిష్యులందఱు గూడఁ
గవిత యల్లు నేర్పు గడన చేయు
విధము లెల్ల నేను విశదము చేసితిఁ
బౌరు లెల్ల నన్నుఁ బ్రస్తుతింప.

నాదు కవనకీర్తి నా బోధనాశక్తి
కనిన డి. ఇ. ఓ. లు కరము మెచ్చి
నన్నుఁ గూర్చి వారు చన్నట్టి బడులలోఁ
బ్రస్తుతించినారు బాహిరముగ.

రామారావనఁగా నొక
ధీమణి యరుదెంచె నాఁడు తెలుఁగున్ జూడన్
నే మాణవులకుఁ గఱపుట
యా మాన్యుని కెంతొ నచ్చె నా సాయమునన్.

సభ యొకండు మా బడిలోన జరుపఁబడియె
వాని గౌరవార్థంబుగా దాన నేను
పండితుల జీతముల గూర్చి పద్యమాల
1 యాశువుగఁ జెప్పగా విని యతఁడు మెచ్చె.

అధిక మధురమౌ కంఠాన నాశు కవిత
వినిచి నంతనే యాతఁడు తనిసి మిగుల
స్కూలు ఫైనలు పేపరుల్ కొన్ని దిద్ద
వాక్సహాయంబు చేసె నప్పట్టు నందు.

---

1 చూడు తెలుఁగురాజు కృతులు

నాలుగేండ్లు గుడివాడ స్కూలు లోనఁ
దెలుఁగు టొజ్జగ నేనుండి కళలు గఱపి
పిన్న పెద్దల మన్ననల్ కన్నవాఁడ
శిష్యులెందఱో కవులౌచు చెలఁగినారు.

అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారి
యాదరంబున నాల్గేండ్లచట నున్న
యపుడె యాతని యర్ధాంగి యస్తమించెఁ
బిల్లలును దాను ననుఁగాంచి గొల్లుమనిరి.

సాను భూతిని జూపఁగాఁ జనిన నన్నుఁ
గాంచి గోపాలకృష్ణయ్యగారు నాఁడు
వీడి నటువంటి కన్నీళ్ళు నేఁడు గూడ
నస్మదీయాత్మీయుగ్మంబు నందు మెలఁగు.

గుడివాడ వీడి పిమ్మట
నడుగిడితిని తణుకులోని హైస్కూలున నా
పడు బాధ లెల్లఁ దీర్చిన
గుడివాడకు నాఁటు నొక్క గుడ్ బై యిడుచున్.

తనుకునకు నాలుగు మయిళ్ళ దవ్వునందుఁ
గలదు కాఁకరపఱ్ఱను గ్రామ మదియ
నాదు కాణాచి యగుటచే నాదు పితల
యాజ్ఞ నట నుండియే తణ్కు కరుగుచుంటి.

సైకిలొకదాని కొని దాని సాయమునను
తణుకు వచ్చుచుఁ బోవుచుఁ దత్ కుటుంబ
భారమంతయుఁ దలఁదాల్చి పరమభక్తి
తల్లిదండ్రుల పూజలఁ దనిపినాఁడ.

నాయనమ్మగారు నా తల నిమురుచుఁ
గష్టజలధినుండి గట్టునెక్కి
మార్గమేదియైన మనుమఁడా! కనుమంచు
వెట్టియాస లేవొ వెల్లడించు.

చాలి చాలని జీతంబు సాయపడఁగ
సిరులు కొంచును సంసారమెల్ల నేనె
పెద్ద యనుజు లక్ష్మీపతి పెండ్లి జరిపి
చెల్లి వేంకాంబ పెండిలి చేసినాఁడ.

తెలుఁగు కావ్యాల తీరులు తియ్యములును
దేట దెల్లముఁజేయుచుఁ దెలుఁగు నాటి
పత్రికలకు విమర్శనల్ వ్రాసికొనుచుఁ
గావ్యములు గూడ వ్రాయఁగాఁ గడఁగినాఁడ.

దైనందిన మీ రీతిని
మానిత కావ్యముల నల్లి మాన్యత గనుచున్
జ్ఞానార్జనమును జేయుచు
నానాఁటికిఁ బేరు దెలుఁగు నాటం గంటిన్.

ఊరూర జరుగుచుండెడు
సారస్వత సభలకేఁగి శాస్త్రార్థంబుల్
సారెకుఁ జేసెడు ధీరుల
సారంబులఁ దెలిసికొంచు సన్నుతి గంటిన్.

నా చదివిన వ్యాసంబులు
నా చదివిన కావ్యవితతి నానారచనల్
ప్రాచుర్యమొందె సభలను
బ్రాచీన నవీన సూరివర్యులు మెచ్చన్.



శ్రీ వెలగపూడి రామకృష్ణ, ఐ. సి. యస్.

కృతిపతి బావగారు

తండ్రి శ్రమలెల్ల నేనయై తలను దాల్చి
ఎట్టో సంసారభారంబు నెట్టుచుండ
శుక్రదశ వచ్చె జాతక చక్రరీతి
గష్టములు మెల్ల మెల్లఁగా గట్టు నెక్క.

తల్లి దుర్గాంబికా సతీధవుఁడు తాను
రామ కృష్ణుఁడు జయపుర రాజ్యమునను
ముఖ్య మంత్రిత్వభారమ్ము పూని సకల
సమ్మతమ్ముగఁ దత్పాలనమ్ము సలిపె.

రామచంద్ర దేవరాజు మహా మంత్రి
రామకృష్ణ నాకుఁ బ్రాణ సఖుఁడు
కాన జయపురంబు గాంచఁగా రమ్మని
కమ్మ వ్రాసి పంపెఁ గరుణ వెలయ.

సంబరమున నేనుఁ జనినాఁడ జయపురి
కచట దుర్గ నన్ను నాదరించి
కన్న తండ్రి కన్న మిన్నగాఁ బూజించె
అన్న బాబు గూడ నటనె యుండె.

రామకృష్ణగారు రాచకార్యములపై
నితర రాష్ట్రములకు నేగినారు
వారు వచ్చుదాఁకఁ దీరికగా నేను
నుంటి నచట వారి యింటి యందె.

దండ కారణ్య సీమయై దర్శనీయ
సస్య, జలపాత, పర్వత, తృణజ పక్షి
మృగ కులమ్ముల కిక్కయై యెసఁగు చున్న
జయ పురీ రాజ్యమును గంటి స్వాంత మలర.

కొండ లోయలలోనఁ బండు వివిధములౌ
పైరు పచ్చల జగా సౌరు గాంచి
చందన వనవాటి యందుఁ జరించెడు
భిల్లాంగనల లాస్యవిధము గాంచి
ఎలమావి కొమ్మల నెక్కి కుహూ కుహూ
యను కోకిలాలాప మాలకించి
ఇన కరమ్ములు సోక నీయక పెరిఁగిన
తరు లతా గుల్మ సంతతులు గాంచి

క్రేళ్ళు దాఁటెడు చిన్నారి లేళ్ళగాంచి
యడవి పందుల, దుప్పుల, నడవి కోళ్ళఁ
బులుల మనుబిళ్ళ నెమ్ముల జిలుక గోరు
వంకలం గాంచి చాల సంబరము నొంది.

మిట్టు పల్లాల నేలపైఁ దుఱ్ఱు మనుచు
బాబు మోటారు సైకిలు స్వారిఁ జేయు
చుండ నేనును వాని చేయండఁ జేసి
నేర్చినాఁడ నా సైకిలు నెక్కుతీరు.

సీతునందు మేను జిల్లాక్చకొనిపోవు
వాన కంతు పొంతు గానరాదు
తోస మొదవఁ జేయు వాసంత మెంతయు
జయ పురంబునందు జనులకెల్ల.

సన్న బియ్యమునకుఁ జాఱ పప్పునకును
జయ పురంబు పేరు చాలఁగాంచె
కొండ బండ లెల్లఁ బండెడు భూములై
జయపురంబు వృద్ధి చాటుచుండు.

తల్లి దుర్గాంబ నన్ను నాదరముతోడ
సకల విధముల మన్ననల్ సలుపుచుండ
బాబు నా చెంతనే యుండి పలుకు లాడ
నుంటి శ్రీ రామ కృష్ణుని యింటనేను.

ఒక్క వారంబు నే నట నున్నమీఁద
రామకృష్ణుఁడు చను దెంచి ప్రేమ మొలుక
నెపుడు వచ్చిరి రాజుగారింటియొద్ద
నెల్లరును క్షేమమే యంచుఁ బృచ్ఛ చేసె.

చిత్త మని నేను బలుకఁగాఁ జేరఁ జీరి
కష్ట సుఖములు గనుఁగొని హృష్టుఁ డగుచుఁ
బలికె నను గూర్చి తేనియ లొలుకుచుండ
వెన్నెలలు గాయ ముఖ చంద్రుఁ డన్నియెడల.

ఇంద్రావతి నది యొడ్డున
సాంద్రమ్ముగ వడ్లు పండు సారపు భూముల్
చాంద్రీ సమకీర్తీ! విని
యుం ద్రవ్యానినిఁ గుఱించి యొకపరి మీరల్.

కోటపాడు తాణ గోమరారు ఆసనా
భూము లరసి రండు పొంను చెపు
ఆ యమీనుకేన యానతిఁ బెట్టుదు
నగపఱుపఁగ మీకు నా పొలాలు.

అంచు నొక్క చీటి యా యమీనున కిచ్చి
పంపినాఁడు నన్నుఁ బరమ రక్తి;
నేను గోటపా డమీనును గనుఁగొని
కమ్మ నీయ నతఁడు గారవించి.

ఆసనా యను గ్రామమ్మునందు నున్న
వంద యెకరాల భూమి మున్ముంద చూపె
నద్ది యింద్రావతీ తీరమందు నుంటఁ
బంటనేలని వేఱె వాకొంట యేల.

తొలకరిని సన్న ధాన్యము
చలికాలము నందు సెనగ చాలగఁ బండున్
వలరాచ విండ్లు పెరుఁగును
అలవడు మేలిమి పొగాకు నాసన యందున్.

అని యాౘైతులు చెప్పినంతట మనంబానందంబున్ జెందఁగా
గని నే భూమిని నాల్గు మూలలను, నిక్కంబౌ అరోమావళుల్
తను వందెల్లెడ; వచ్చినాఁడ మరలన్ దాతృత్వమూర్తిన్ ఘనున్
జనతా పోషకు రామకృష్ణుని మహా సౌజన్యరాశిం గనన్.

వచ్చినంతనె ననుఁగాంచి నచ్చె నొకొ్క-
భూము లయ్యవి రాజుగారూ! మన పొల
ములను మించిన వివి శ్రమ పొంది సాగు
చేసినం బండు పొంఁడు మీర్ శీఘ్రముగను.

చేరికొని రండు మీ తండ్రిగారి నిటకు
వారు చూచిన పిమ్మట మీరు కనిన
భూమి యంతయు మీకిత్తు లేమి పాయుఁ
గరిసనము చేసి తొల్లింటి ఘనత గనుఁడు.

అనుచుఁ బ్రేమైక మూర్తియై యమృతధార
లొలుక శ్రీరామకృష్ణుండు పలికె నంతఁ
దల్లి దుర్గాంబతోఁ జెప్పి తరలి వచ్చి
యెల్ల విషయాలు జనకున కెఱుఁగఁ జెప్పి.

తండ్రిగారిని దోకొని తత్క్షణంబ
ఎలమి ననలెత్త జయపురం బేగుదెంచి
రామకృష్ణుని దర్శించి ప్రేమతోడ
నతఁడు చేసిన యాతిథ్యమంది మరల.

కోటపాటి యమీనును గూడి వెడలి
[1] యాసనా భూములన్ని మాయయ్య కపుడు
చూప మాతండ్రి చేయెత్తి సూర్యు మ్రొక్కి
యద్దికొనిఁ జేలలో మట్టి యక్షులకును.

కరిసనము చేఁత నిండుగ
నరసిన తల యూఁపికొనుచు నబ్బురపడుచున్
గరుపారెడి మేనున్ మూఁ
పురములు మూడగుచు తండ్రి మోదము నందెన్.

ఇరువురము గూడి క్రమ్మఱ నేగుదెంచి
రామకృష్ణుని దర్శింపఁ బ్రేమమూర్తి
యాతఁ డీక్షించి మాతండ్రి ననియె నిట్టు
లమృత నిష్యంది వాక్కుల నాదరించి.

1. ఆసనా = ఇది యొక యూరు.

ఏమి రాజుగారూ! భూము లెట్టులుండెఁ?
గష్టపడి మీరు చేసినఁ గరిసనంబు
లావుగాఁ బండు మున్ముందు లాభసాటి
యౌను రైలు వచ్చునిటకు నబ్బు ధరలు.

అట మలేరియా లేదిసుమంతయైనఁ
గాన గైకొనుఁడా భూమి నేను మీకు
నెల్లహక్కుల తోడుత నిచ్చువాఁడ
ననుడు మా తండ్రి చిత్తమం చంజలింప.

"పెద్దవారు మీరు పెట్టరా దంజలి"
యంచు వినయగరిమ మీర నెఱపి
నన్ను నుండుమంచు నాయన గారికి
సెలవునిచ్చి పంపె నలఘుఁ డతఁడు.

గురువుగా నాకు దుర్గాంబ కరము భక్తి
సకల విధముల మన్ననల్ సలుపు చుండ
రాచ కార్యాల మునిఁగియు రామకృష్ణ
ఎడప దడప నాతో ముచ్చటించు చుండు.

ఇట్లు కొండొక ప్రొద్దు తా నేఁగఁగానె
వచ్చె వాసంత శోభతోఁ బెచ్చు పెరిఁగి
శుక పికాలాప శోభన స్ఫూర్తి తోడఁ
బర్వములకాది విభవ సంవత్సరాది.

కుహు కుహూ యని కోయిలల్ గూయుచుండ
వేఁప పూపచ్చడిని దెచ్చి పెట్టె దుర్గ
రామకృష్ణుఁ డా 'యాసనా' భూమి నాకు
వ్రాసి యిచ్చెను బట్టాను బహుమతిగను.

విభవ సంవత్సరాది నన్ విభవ యుతునిఁ
జేయ నొసఁగిన యట్టి యా క్షేత్ర ఖండ
దాన పట్టిక చేకొని నేను గృతము
తెలిపి శ్రీరామకృష్ణుకు సెలవు గొనుచు.

కాఁకరపఱ్ఱునకును జని
నాకై కనిపెట్టియున్న నాన్నకు బట్టా
వే కరమున నిడ జనకుఁడు
శ్రీకరమని కనుల కద్ది చెందెను ముదమున్.

నాయనమ్మగారు నారాక కనుగొని
తెచ్చినట్టి పట్టు తీరుఁగాంచి
యుల్లసిల్లె మిగులఁ దల్లితోపాటుగా
మోదమొందినారు సోదరులును.

కాని వారలకును గనుగుట్టె నా వార్త
సఖులు మెచ్చుకొనిరి సంతసించి
లోకమందు నటువ కాకుల మూఁకలు
కోకిలములు గూయుఁ గొసరికొసరి.

పట్టావచ్చిన కొన్ని నాళ్ళకు ననున్ బాజారులోఁ గాంచి పెం
దట్టంబైన పనిన్ వెలార్ప నొక మిత్రంబర్థిమైఁ గోరఁగా
చట్టన్ నేఁ జని యాపనిన్ క్షణములో సల్పింపఁగా నాతఁడున్
పట్టన్ రాని ముదంబుఁ జెంది మదిలోనన్ మెచ్చి నా మైత్రికిన్.

సఖిల జ్ఞాప్తకులుఁడు కలిదిండి యింటిపేర్
వెలయువాఁడు కలిమి బలిమి గలఁడు
రామచంద్రరాజు ప్రేమైక సన్మూర్తి
పలికె నిట్లు తనదు భావమిచ్చి.

"రామకృష్ణగారు వ్రాసిన యీ భూమి
బంజరంచు నింటి బావగారు!
దాని సాగుఁజేయ వేనవేలగుఁగదా
వ్యయము, ధనము నెట్లు పడయఁగలరు?

బాధ పడకుఁడు నే తెచ్చి పైక మిడుదుఁ
బద్దు నున్ బాయిదా వద్దు వలసినన్ని
యెడ్ల జతల గొని కృషి సాగించు మనుఁడు
మీ జనకు జయపుర మంపి మీరు రండు."

అనియామిత్రుఁడు సొంతయూరు సని యత్యంతాను రాగంబునన్
ధనమున్ దీసుక వచ్చి యీాయ నపుడే తండ్రిన్ బ్రయాణించి నేఁ
జనినాఁడన్ జయపూరురాజ్యమున నాస్నా భూములన్ దున్నగాఁ
గనినాఁడన్ సఖు రామకృష్ణు నచటం గళ్యాణ సంధాయకున్.

కాంచి భూమి సాగు గావించు తెఱఁగును
విన్నవించినంత విని యతండు
గట్లు కట్టఁజేయఁ గట్టడ గావించెఁ
గోట పాటమీాసుఁ జీటి వ్రాసి.

మలకనగిరి యెద్దుల దా
విలిపించి యొసంగె సాగు వెంటనె చేయన్
గల ధనము నెల్ల కై యిడి
యిలు గూడను గట్టి నాఁడ యేడ్తెఱ నపుడే.

వంట చేసి తినుచుఁ బంటలు బండింప
నెండ వాన సీతు నెఱుగకుండఁ
జాల శ్రమలు పడుచు జనకుండు వ్యవసాయ
మాస్థతోడఁ జేయు చచట నుండె.

తణుకులోన నేను దరుణియుఁ దమ్ముఁడు
నుంటి మద్దె కొంప, నింటి యొద్ద
నమ్మ నాయనమ్మ యనుజన్మ రాలును.
బెద్ద తమ్ముఁగుఱ్ఱ విడిసి యుండ్రి.

మూఁడు కాఁపురాలు నీడుచు చెల్లెల్లొ
క్రొత్త భూమి సాగు కొఱకు ధనము
నప్పు సప్పు చేసి యంపుచు నుండితి
నాపి రాడకుండె నొక్క యపుడు.

పిన్న చెల్లెలు పాపాంబ పెండ్లి చేసి
పిన్న తమ్ముఁడు సుబ్రాజు పెండ్లి చేసి
స్కూలు ఫైనలు చదివించి వాని కొక్క
చిన్న యుద్యోగ 'మిప్పించికొన్న పిదప.

పెద్ద తమ్మునిఁ దద్భార్యఁ బిల్ల వాని
అమ్మనున్ నాయనమ్మను నంపి నాఁడఁ
గోట పాటికి వార లా కొంపలోనఁ
బాఁడి పంటలఁ గాలయాపనముఁ జేయ.

ఏను తణుకు నందె హేరాళ మౌ శ్రద్ధఁ
గవిత ల్లుకొనుచుఁ గళలఁ గఱపు
చనుఁగు బాలకులకు; నరుగుచు వచ్చుచు
నుంటి నడుమ జనకులున్న యెడకు.

దసరా దర్బారులకున్
వెస నేఁగుచు జయపురం పువేడుక లరయన్
అస మొందు చుంటి తెలుఁగున్
దెస లెల్లయెడలను గయిత తీరులు వెలయన్.

శ్రీ రామకృష్ణుఁ డర్మిలి
రారమ్మని భూమి నిడిన లగ్నము నందే
యా రామచంద్ర రాజును
గారామునఁ బెట్టు బడికిఁ గనకం బిడియెన్.

రామచంద్రరాజు ప్రథమ పుత్త్రుఁడు నాడు
నింట నుండి చదివె నింగిలీషు
స్కూలుఫైన లందుఁ గొని విజయంబును
బయికిఁ జనియె నతఁడు భద్రమతిని.

ఇంతలో రైతు పాలిటి యేలినాటి
శనియొ యనునట్లు వేగ నీ సకలధాత్రి
యందుఁ గల్గిన సకల ధాన్యముల ధరలు
నొక్కమాఱుగఁ బడిపోయె నక్కటకట.

పోఁకకు ధాన్యముల్ విపణిఁ బుట్టెఁడు చొప్పున నమ్మసాగె నా
చౌక ధరన్ గృషీవళులు సల్పిన యప్పుల తీర్పలేక య
ఱ్ఱాఁ కలఁ బెట్టఁ బన్నులకు రాజులు; భార్యల పుస్తెపూసల
న్నేకరి యమ్మసాగి రిఁక నేమని వ్రాయుదు రైతు బాధలన్.

కలుపు తీఁతలు గోఁతలు సలుపునట్టి
కూలినాలి జనంబులు కొలుచు గొనక
పైక మిమ్మఁడని నిర్బంధ పఱచు చుండ
నప్పు పుట్టక సైరికు లడలినారు.

నెల కఱువది రూపాయలు
గల జీతముతోడ నేను గాలము గడుపన్
గలిగెడు నా రోజులలో
పలను గరిసనమది గిట్టుబాటు కలుగమిన్.

పన్నుల భారం బొక్కటు
నన్నును బాధించు చుండ నా బంధులతో
నాన్నయు నమ్మయు గూడను
నన్నే వేధించినారు నానాగతులన్.

చెప్పనే గృహచ్ఛిద్రము లిప్పు డవ్వి
దక్షవాటీశు గరుణచేఁ దనయ నాకుఁ
గలిగె నా భార్య నోముల ఫలము గాఁగ
బిడ్డ భీమేశ్వరి యని నేఁ బిలుచుకొందు.

భీమేశ్వరి యుదయించిన
జామున నుండియును నాదు జననీ జనకుల్
కామిత మందారులు తా
మేమో తలఁచి నను వేలి యెంచిరి మదులన్.

ఆర్థికపు మంద మొదవిన యాదినాల
యందె తణుకులో నే విడియంగ నొక్క
చిన్న డాబాను గట్టితి నాన్నగారి
కమ్మగారికి నది కిట్టదయ్యె నేమొ!

దసరా వేడుకలను గన
రసికాగ్రణి రామకృష్ణ వ్రాయఁగ జయపూ
రు సనుచుఁ బ్రతియేఁట నచటి
వసుధేశుని సభల యందుఁ బాల్గొను చుంటిన్.

రామచంద్రదేవు రాజితామల భావు
జయపురేశు సభను సన్నుతింపఁ
బడుట కంటె వేఱె భాగ్యము లేదది
రామకృష్ణ కరుణఁ బ్రాప్తమయ్యె.

కవితాశక్తికి రాజగౌరవము ముఖ్యామాత్యు సాహాయ్యమున్
మిత్రులంగా లభియింప నా యశము భూమీ మండలం బంతటన్
నవ లావణ్య మవగణ్యమై వెలిఁగె నానాఁటన్ సుధీస్తుత్యమై
కవికిన్ బ్రాపు లభింపఁ గావ్యసుమముల్ గల్పింపవే తావులన్?

కావ్యముమీఁదఁ గావ్యములు గల్పనసేయుచు నాఁడునాఁటికిన్
నవ్యము లైన భావము లనారతముంగనుపర్చి యెన్నియో
భవ్యము లైన వ్యాసముల వ్రాయుచుఁ దెల్పితి సాహితీ గతుల్
దీవ్యదనంత భావయుత దీప్తుల నాప్తులు దృష్టిగాంచఁగాన్.

ఒకమూల ధరల మాంద్యము
నొకమూలను కరము భరము నొక్కెడఁజుట్టల్
ప్రకటించు గంటుఁదనమును
వికలత గలిగించు చున్న వీడని వీఁకన్.

సకలాంధ్ర దేశమందును
బ్రకటిత మగు పత్రికలకుఁ బంపుచు రచనల్
సకలాంధ్ర కవుల మన్నన
లకలంకతఁ గాంచు చున్న యవసర మందున్.

ఒక్క యధికారి నను దణ్కునుండి యుండి
పురికి బదిలీ యొనర్చెను వెఱచి యేమి
చేయఁగా లేక తనకేమి చేఁతగాక
యచటనే యుంటి రెండేఁడు లటమటించి.

రామచంద్రరాజు రామకృష్ణ దివాను
గాంచుచుండ్రి నన్ను గౌరవమునఁ
దఱచు రామకృష్ణు దర్శనమొనరించి
వచ్చుచుంటి నతఁడు మెచ్చు నన్ను.

ఉండిలోన నేను నుండిన యయ్యెడ
నింతి సుతయుఁ గూడ నేక సమయ
మందు జ్వరము వచ్చి యల్లాడి పోవఁగా
మందు మాకు లేక కుంది కుంది.

దక్షవాటీశు భీమేశుఁ దలఁచి దలఁచి
[1] శత విధంబుల స్తోత్రంబు సలిపితి నిటు
భుజముపైని భీమేశ్వరి, పొలఁతి మంచ
మందు మూల్గుచు దొర్లుచు నడలుచుండ.

1. చూడు భీమేశ్వర శతకము, తెలుఁగు రాజు కృతులలో.

అస్తోకంబగు భక్తి తోడుతను దక్షారామ భీమేశ్వరున్
విస్తారంబుగ రాత్రియుం బవళులున్ గేల్మోడ్చి ప్రార్థింపఁగా
సుస్త్రీ యింటికి బిడ్డకున్ దొలఁగెఁ బస్తుల్వీడి పథ్యంబులన్
శస్త్రారోగ్యము గాంచినారు సొరిదిన్, శాంతించె నా డెందమున్.

అంతలో నాయనమ్మ తా నాక మేఁగె
ఉండిలో నేను పడినట్టి యుల్ల మెరియు
బాధ లన్నియు వివరించి వ్రాసి కొంటిఁ
గన్నతల్లికి హృదయంబు గదలి పోవ.

ఎండయు వాన నాక తన యిల్లు ప్రవాసపు చోటు నాక యా
కొండు నలంగుదున్ నిదురకుం దటి తప్పెడు వేళయయ్యె నా
కండను నాక 'జేపురపు' తన్మస్థలి వృద్ధిని జేయఁగోరి యు
ద్దండుఁడు రామకృష్ణుఁడునితాంతముచేయుచపూర్వయత్నముల్

తన రాజన్యుఁడపుత్రుఁడౌటకు మదిన్ దార్కొన్న దుఃఖంబుతోఁ
దన రాజ్ఞిస్వసనే వివాహము గొనన్ దానొక్క లగ్నంబిడన్
చని యా తన్మపతి పెండ్లిఁజేసికొనఁగా, సంజాత రోగార్తుఁడై
చనిపోయెన్ మన రామకృష్ణ మదిలో సంతాపముం జెందఁగా.

రాజ మరణంబు తోడ శ్రీరామకృష్ణ
కట్ట దలఁచిన మేడ లప్పట్టు నందు
నొక్క మాటుగ నేల పై కొరిగి పోయె
దైవకృతమున కిల నసాధ్యంబు గలదె.

దానితో రామకృష్ణ దివానుగిరిని
మాని యాంగ్ల ప్రభుత్వపు మానితంబు
పదవిలోఁ జేర నిశ్చయ భావుఁడయ్యె
నాదు హృదయం బపుడు నడునడు నడంకె.

దీనజనవర్మ విక్రమదేవ వర్మ
జయపురీ రాజ్యసీమకు స్వామిఁ జేయు
నాఁడు దర్బారులో నేనుగూడ నుండి
ప్రస్తుతించితి నిటు మంత్రి, రాజవర్య.

యావనమంతయున్ జయపురాటవి పాలయి పోయెనంచు లో
నోవకు రామకృష్ణుఁడ! తనూభవుఁడైతివి రామచంద్ర దే
వావని నేతకున్ గనుక నాంధ్రము విశ్వకళావిరాళమున్
యీ వొనరింపఁజేసి ఋణ మీఁగతి పొమ్మదె చాలు జన్మకున్.

వ్యాస శ్రీకవితా విభూషితు లఖండానంత సాహిత్య ధీ
భాసుల్ మీ సభ గావ్యనిర్మితి కళాభ్రాజిష్ణులై మించుతన్
వాసోగ్రాసము లొంది నీ ప్రజల పూర్వానందమున్ జెందుతన్
[1]గాసింబాత్రుఁడు చెందకుండుత మనూనంబైన నీ చెంగటన్.

అంచు నేను పద్యములు పఠించినంత
నిండు పేరోలగములోని నిఖిల జనులు
ఇంచు వేడుక నన్ను శ్లాఘించినారు
రామకృష్ణుని కన్నులు తేమగిల్లె.

సభ చాలించిన పిమ్మట
రభసంబున రామకృష్ణ ప్రభుచే నాకున్
అభయంబిడఁగా నొనరిచె
శుభకరుఁ డా విభుఁడు నన్నుఁ జూచెం గరుణన్.

రామకృష్ణుని పిమ్మట రాజ్యమునకు
మంత్రియాయెఁ బుల్లారెడ్డి మానధనుఁడు
రామకృష్ణుఁడు ననుఁగూర్చి ప్రేమతోడ
వానికిని జెప్పి యొప్పించె ప్రణయ మొలుక.

1. గాసిన్ + పాత్రుఁడు, గాసీపాత్రుఁడు.

మంత్రి పదవిని వీడుచు మాన్యమూర్తి
పన్ను తగ్గించె మా క్షేత్ర భాగమునకు
కాని బాకీలు తీరుట కానరాక
నేను పడుచుంటి కడు పడరాని పాట్లు.

కవిజన మందారుండగు
నవనీపతి విక్రమేశు నంకమ్మునకున్
[1] కవనాన విన్నపమ్మును
ప్రవిమల మతి నే రచించి పంపితి నాఁటన్.

విన్నపంబును దిలకించి నన్ను మెచ్చె
నంతియేకాని పన్నుల నణఁచ లేదు
సివిలియను దివానుగిరిని జేయుచుంట
దాను స్వాతంత్ర్యమొందును బూనఁడయ్యె.

ఉండిలో రెండు వత్సరా లుండినంత
తిరిగి తణుకునకే నరుదెంచినాఁడ
సొంత యింటినిఁజేరితి – సంతసమునఁ
గావ్యములు గొన్ని వ్రాయఁగాఁ గడఁగినాఁడ.

1. చూడు తెలుఁగురాజుకృతులు

కోట పాటి కరిసనమ్మ కూడి రాక
పడెడి బాధలతో పాటు బంధు కోటి
కుట్రలకు లోఁగి జనకులు గూడ నన్నుఁ
జిన్న చూపునఁ గనుటకు సన్నగిలితి.

తండ్రి యొకనాఁడు పంపెనో తంతివార్త
ఆలి కడనున్న రూకల నంది చేత
గొబ్బునను జేరినాఁడను కోటపాటిఁ
గాలుబెట్టితినో లేదొ యాలయమున.

అమ్మయును నాన్న యేమేమొ యాడినారు
జనని పాదమ్ములకు నేను సాగి మ్రొక్కి
గోరు వెచ్చగ నున్న గన్నీరి తోడ
నామె పదములు కడిగినా నమిత భక్తి.

వెంటనే భూమియంతయు సెంటుగూడ
నట్టి పెట్టక తమ్ముల కప్పె వ్రాసి
యిచ్చి పితలకు నేఁటేఁట నేను గరిసె
ధాన్య మీయఁగ నొడఁబడి తణుకుఁ జనితి.

అప్పటికె నాకు రెండవ యాత్మజాత
ఇందిరాదేవి యుదయించి యెదుగు చుండె
పుత్రికా యుగ్మమును నేను బొలఁతి గూడి
కాల యాపన జేయఁగాఁ గడఁగినాము.

ఒక్క సెంటైన సొంతాని కుంచు కొనక
భూమి తమ్ముల కిడుటది బుద్ధి తక్కు
వంచు ప్రాణమిత్రములు నిందించినారు
వారితో నిట్లుగా నేను బలికినాను.

ప్రేళుల మీఁద నిల్వబడి వేడికి గాలికి సీతు బాధకున్
చాలగ డస్సి క్రుస్సి మెయి సర్వము గంటులు వాఱ నెత్తిపైఁ
దాళఁగ రాని భారమును దాల్చి సుధాజలమిచ్చి యెల్లరన్
జాలి కరంగి తన్పు నిను సన్నుతి చేసెద నారికేళమా!

అంచు ననుఁగూర్చి యన్యోక్తి నాడినట్టి
పద్యభావంబు గ్రహియించి హృద్యభావు
లౌచు మిత్రులు కొనియాడి యరిగినారు
గావ్యరచనల నేఁ బ్రొద్దు గడపుచుంటి.

వ్రాసిన కావ్యము లన్నియు
భాసిత కవిరాజసభల పఠియించి సదా
వాసియు వన్నెయుఁ గాంచుచు
రాసిక్యము చూపినాఁడ రాచఱికమునన్.

అంత నుదయించె నా కొక్క యాత్మజుండు
రామకృష్ణరాజని వానిఁ బ్రేమతోడ
రామకృష్ణ సన్మిత్రుని నామమునను
బిలుచుకొంచును గృతమును దలఁచుచుంటి.

సుతుఁ డుదయించిన పిమ్మట
సతితోనే బ్రహ్మచర్య సన్నిష్ఠ మెయిన్
సతతము జీవింత మనిన
నతి మోదముతోడ నామె యనుమతి చూపెన్.

ఇరుపూఁట కుడుచుచు నెడనెడఁ గుడువక
యుండెడు నట్టి సదోపవాసి
పుత్రోదయమునుండి పుణ్యవ్రతాత్ముఁడై
బ్రతుకుచుండిన యట్టి బ్రహ్మచారి
అడిగినవారికి నౌను గాదనకుండఁ
దనకున్న దిడెడు నుదారమూర్తి
సరళాతి సరళమౌ సరసకావ్యంబుల
నికరంబు వ్రాసిన సుకవిరాజు

అంచుఁ బ్రజలును నృపమౌళు లభినుతింపఁ
దెలుఁగు నేలను గల నాల్గు వలఁకులందుఁ
బేరు గీర్తులు గొనుచున్న వేళయందు
ఆంగ్ల జర్మను పోరాట మవతరించె.

నాదు క్షేమంబు గోరెడు నాసఖుండు
రామకృష్ణుఁడు ననుఁ బిల్చి ప్రథిత యుద్ధ
తంత్రమునఁ బ్రచారకునిగాఁ దనదు కడను
బెద్ద యుద్యోగిగా నన్ను వెలయఁజేసె!

ఆంధ్ర భూభాగమెల్ల నే ననుదినంబుఁ
దిరిగి సిక్కిపియనులుగా దిట్టలైన
వారి రిక్రూటుఁ జేయుచుఁ బ్రభుతవలనఁ
బ్రజల వలనను మెప్పును బడసినాఁడ.

రామకృష్ణుఁడు గాంచె దుర్గాంబ వలనఁ
బుత్రి నొకదాని నిరువుర పుత్రకులను
పుత్రి గర్భంబు ఫలియించి పుట్టినారు
మువురు మనుమలు ముద్దుల మూటలౌచు.

శర్కరాయంత్ర నేతయై సౌధయంత్ర
ములను నిర్మించి మమ్ములఁ బ్రోచు రామ
కృష్ణు దుర్గాంబ మెడ్రాసుకేగి కనుచు
వారి యభివృద్ధికై యెంతు వారి జాడ్యు.

యుద్ధ తంత్రంబులను మున్నియుండి గూడ
కావ్యరచనం బది యథాప్రకారముగనె
చేయుచుంటిని పరిణతి చెందినట్టి
ప్రతిభ వ్యుత్పత్తియు నుపజ్ఞ బంధురముగ.

[1] రామకృష్ణుని జీవిత ప్రాభవంబు
ద్విపద కావ్యంబుగా వ్రాసి దీర్చి జయపు
రావనీ నేత విక్రమదేవ వర్మ
కంకితం బిచ్చితిని దణ్కునందె నేను.

చిందు మరందబిందువులు చెప్పిన నానవకావ్యరాజ మా
నందముతోడ నంకితము నంది రసజ్ఞుఁడు కావ్యభర్త నా
యందలి గౌరవంబు మెయి నర్హతకున్ దగునట్లు మెచ్చుచున్
వందెకరాల నేలిడె వదాన్యుఁడు విక్రమదేవవర్మ తాన్.

---

1. శ్రీ రామకృష్ణ శ్రీ దుర్గాంబలయు, శ్రీ విక్రమదేవవర్మ మహారాజులయు చరిత్రకై తెలుగురాజు కృతులలోని 'రామకృష్ణము' చూడుఁడు.

రాజులు పూర్వమందుఁ గవిరాజుల నేనుఁగు నెక్కఁజేసి ని
ర్వ్యాజపుభక్తి రాజనగరంబులఁద్రిప్పిరి పౌరులెల్ల నీ
రాజన మెత్త, నేను గవిరాజును గావుటఁ దణ్కులో మహా
రాజును ద్రిప్పినాఁడ రథరాజముమీఁదను విక్రమేశ్వరున్.

భుక్తికిన్ దగ్గ జయపురి భూమి నిచ్చి
తనదు పేరిట నొకమేడ తణుకునందుఁ
గట్టిపెట్టించి తన సభాకవిగ నన్ను
నెన్నికొని విక్రమేశ్వరుఁ డెంచె సుతుగ.

జయపుర గెస్టుహౌసున విశాఖ హావామహాలందు మంత్రితో
జయపుర రాజుతోఁ గలిసి చారు కవిత్వ పటుత్వ చర్చ ని
శ్చయముగఁ జేసి మన్నన లపారముగాఁ గొనునట్టి భాగ్య మే
మయకిటులబ్బె నా కొకని కబ్బెనుగాక ధరాతలంబునన్.

దసరా దర్బారులలో
రసవత్కవనంబుచెప్పి రాజాస్థానిన్
వసుధా నాధుని ప్రక్కను
పసిండి గద్దియపయిని నుపవసించితి నే.

KALAPRAPURNA
SREE VIKRAMADEO VARMA,
D LITT.
MAHARAJAH OF JEYPORE



(HAVA MAHAL.
MAHARANIPETA (VIZAG) 

Fort. Jeypore, (Orissa)
5th April 1942.

While appreciating the poetical talents of Pandit Sri Penumechcha Satyanarayana Raju Garu, Vidwan and Kavita-Visarada of Tanuku, I hereby appoint him as an Honorary Durbar Poet of the Jeypore Samasthanam.

Varma

MAHARAJAH OF JEYPORE.

Pandit Sri Penumechcha Satyanarayana Raju Garu,
Vidwan & Kavita-Visarada,
T a n u k u.

మేడయు పంటభూములు నమేయుఁడు విక్రమదేవవర్మ న
న్నీడిత సత్కవీంద్రునిగ నెంచి యొసంగుటఁ జేసిగాదె నే
నోడల గాలియోడల మహాత్ముకతన్ జరియించి యెన్నియో
చూడగ దగ్గ దేశములఁ జూచితి భారత భాగ్యసీమలన్.

ఊటీ కొండలు దాట్టి ఘూర్జర కళింగోర్వీస్థలుల్ మెట్టితిన్
లాట బ్రహ్మ మరాట వంగ కురు సౌరాష్ట్రాంగ కాశ్మీర క
ర్ణాటాంధ్రాది సమస్తదేశ నగరీనద్యబ్ధి రాణ్ణిర్ఝరీ
కోటీ కానన శైల శృంగతతిఁ గన్గొంటిన్ మహాత్మాహినై.

ధరణీపాలురు, మంత్రి పుంగవులు, నర్థంబున్న భూస్వాములున్
నిరతంబున్ జనుదెంచి నా గృహములో నీరాని భోసేసి నా
సరసాలాప సహాయసంపదలు విస్తారంబుగాఁ గాంచుటల్
పరిపాటౌటలు రామకృష్ణుని కృపావాల్లభ్యదృష్టాంతముల్.

అవధానంబు లొనర్చి మానితి వృథాయాసంబుగా నెంచుటన్
నవభావంబుల నాశురీతికవితల్ నానాఁట వాక్రుచ్చితిన్
స్తవనీయుండగు విక్రమేశుని సభా స్థానంబు నందుండితిన్
కవిరాజన్ బిరుదంబు గాంచితి, గళా కావ్యంబులం గూర్చితిన్.

చంటి బిడ్డలు దొరఁకొని శాస్త్ర వేత్త
లందఱును గూడఁ జదువఁగా నర్హమైన
పద్య గద్య ప్రబంధముల్ వ్రాసి వ్రాసి
ప్రజల విజ్ఞాన దీప్తికై పాటు పడితి.

శతకములన్నఁ గొందఱికి శాస్త్రము లన్నను గొంతమందికిన్
కతలనఁ గొంతమందికిని గావ్యము లన్నను గొంతమందికిన్
మత కృతులన్నఁ గొందఱికి మక్కువ లౌట లెఱింగి యుంట నే
స్తుతమతి నెల్లవారలును జొక్కెడు పాత్రము లెన్నొ వ్రాసితిన్.

చిత్తు "సాఫ"ను వ్రాఁత నా చేఁత గాదు
తలఁపు కలిగిన వెంటనే కలము గొనుచు
గద్య పద్యాత్మకము లైన కావ్యములను
వడిగ వ్రాయుట నాకు స్వాభావికంబు.

శతకం బల్లితి భీమనాథు పయి రాజస్థాన గాథా కవి
త్రితయా వేదనముల్ రచించితిని గాంధిం బ్రీతిఁ గొండాడితిన్
బతి భక్తిన్ హరి కారి కావళిని భవ్య ప్రక్రియం బల్కితిన్
రతి శాస్త్రమ్ము రసాలమున్ సలిపితిన్ జ్ఞానాంజలిన్ వ్రాసితిన్.

చంపకమాలినీచరిత జాను తెనుంగున సంతరించితిన్
ఇంపెసలారు పద్ధతి నహీనసుధాంబుధి రామకృష్ణుఁ దే
లింపఁ దదీయ జీవితచరిత్ర లిఖించితి ఖండకావ్యముల్
సొంపులు గుల్కఁ బల్కితిని సూరివరేణ్యుల మెప్పుగాంచితిన్.

రాజానందము తెల్గుచేసితి మహాలంకారికుల్ మెచ్చఁగాఁ
బూజాపాత్రము గాఁగ వ్రాసితిఁ దపోభూమిన్ ; గళాతీర్థ వి
భ్రాజద్దీమెయి శ్రీమదుత్తరమహో రామాయణాఖ్యాకృతిన్
నా జన్మంబు తరింపఁగా నుడివితిన్ ధన్యుండ నే నన్నిటన్.

నవ కథావళి నవజీవనంబు మొగలి
రేకు గోరువంక విజయశ్రీయు రత్న
సుందరీ మనస్వినులు సుశ్లోకమైన
విక్రమదేవ శతక మాలపించినాఁడ.

విజ్ఞాన సాగరులు, ప్ర
తిజ్ఞాం ధ్రౌన్నత్యములును ధీశక్తి మెయిన్
విజ్ఞులు మెచ్చఁగ వ్రాసితి
ప్రజ్ఞాధన మినుమడించు వాగ్వైఖరితో.

పైని వ్రాసినట్టి వరకావ్యముల నెల్లఁ
బొలుచు దెలుఁగు రాట్కృతులను బేర
నంకితంబు చేసి యశమును గొన్నాఁడ
రామకృష్ణునకును ప్రేమతోడ.

రామకృష్ణ యశోభూషణా మలకృతి
శ్రీ కలనలు రాజు కృతియు వీఁకవ్రాసి
ఆత్మ జాతక కథయైన యంతవఱకు
[1] వ్రాసికొంటి నారాయణరావు కతన.

[2] జవ్వాది లక్ష్మయ్య స్వ తనయు పేరిటఁ
బొందెను శ్రీతపోభూమి కృతిని
[3] ముళపూడి తిమ్మరా జలరి కోరుకవచ్చి
పొందె రాజానంద భూషణంబు
[4] శ్రీ రామకృష్ణుఁడు శ్రీ తెల్గురాట్కృతు
లంకితమును గాంచి యశము గాంచె
[5] మదరాసునకు ముఖ్యమంత్రియా పి. ఎస్. కె.
రాజు కొనియె మదారాధనకృతి

1. డాక్టర్ అడుసుమల్లి నారాయణరావు, ఆంధ్ర నలంద అధ్యక్షులు ప్రేరణచే.
2. శ్రీ జవ్వాది లక్ష్మయ్య, M. L. A. జమీందారు, పెనుగొండ.
3. శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు, జమీందారు, తణుకు.
4. శ్రీ వెలగపూడి రామకృష్ణ, ఐ సి యస్. - మద్రాసు.
5. పి. ఎస్. కుమారస్వామిరాజా.



శ్రీ వేంకటపతిరాజు, శ్రీమతి రాఘవాంబ
కృతికర్త జననీ జనకులు

రామకృష్ణము జయపురీ భూమి నేత
దీన జనవర్మ విక్రమదేవవర్మ
అంకితంబందె నా యింటి కరుఁగుదెంచి;
తెలుఁగురాజు న్యాకృతిని బిత్తలకు నిడితి.

ఏఁబదేఁడుల వయసు నా కేఁగఁగాన
కోట పాటిని పితృపాదుఁ గోలుపోతి
దూరమున నుంట వర్షాలు తోరమగుట.
రైలు లాఁగుటచేతనే శ్రాద్ధకర్మ

చేయఁ బదియవ నాఁటికిఁ జేరినాను
దల్లియును నాదు సోదరు లుల్లమెరియ
బోరుమని యేడ్వ నేనును బోరుమంటి
తండ్రిగారిని మించిన ధనము గలదె?

వితతంబగు సద్భక్తిని
పితౄణమును దీర్చి నేను పిండోదకముల్
పితృ యస్థికలును గలిపితి
తత గోదావరి జలములఁదద్దయు శ్రద్ధన్.

ఏఁబదాఱేండ్ల వయసు నాకేఁగు దేటి
దల్లి రాఘవాంబిక స్వర్గధామ మరిగె
శ్రార్ధకర్మంబు శ్రద్ధతో సలుపుచుంటి
తల్లికంటెను మఱి దైవతమ్ము గలదె?

[1] జయపురీశునిఁ దన సదనంబునకుఁ బిల్చి
గారవించిన యాది కవి యితండు
[2] సచివోత్తముల స్వీయ సదనంబునకుఁ బిల్చి
గారవించిన యాది కవి యితండు
[3] సత్కవీంద్రులఁ బిల్చి సత్కరించిన యట్టి
కవులలోపల నాది కవి యితండు
భారత ప్రభుతచే బహుమానములు గొన్న
ఘనులలోపల నాది కవి యితండు

సకల సాహిత్య సౌహిత్య సభలయందు
ఖ్యాతి గాంచిన యకలంక కవి యితండు
నాఁగ విఖ్యాతిని దెలుఁగు నాట నెల్లఁ
గాంచి రచియించు చుంటి సత్కావ్యములను.

---

1. కళాప్రపూర్ణ శ్రీ విక్రమదేవవర్మ మహారాజా.
2. శ్రీ కుమారస్వామిరాజా, మద్రాసు ముఖ్యమంత్రి.
శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, ఆంధ్ర ముఖ్యమంత్రి.
శ్రీ కల్లూరి చంద్రమౌళి, రెవిన్యూ, దేవాదాయ మంత్రి.
3. శ్రీ తాతారాయఁడుశాస్త్రి మొదలగువారు.

[1] రాజ కవిరాజులకు మంత్రి రాజులకును
నేను జేసినయట్టి సన్మానములకు
నండ దండఁగ నిలఁబడుచుండు వాఁడు
మూర్తి దాల్చిన సురరాజు మూర్తిరాజు.

కలిదిండి సుబ్బరాజను
లలితాత్మున కిచ్చి పెండ్లి లలి చేసితి నా
తొలి పుత్రిక భీమేశ్వరి
కలిగి రొక సుతయు సుతుండు ఘనులిప్పటికిన్.

హాయిగ మేనయల్లునికి నర్మిలి మీఱ ద్వితీయ పుత్రికన్
ఆయతనేత్ర నిందిర నయాంచిత నిర్మలబుద్ధి కాది నా
రాయణ రాజు నాఁ జెలఁగు నాతని కిచ్చి వివాహమున్ యథా
న్యాయముగా నొనర్చితి ననంతముదంబుధిఁ దేల బంధువుల్.

రామకృష్ణరాజు లాయోల కాలేజి
లోన నాంగ్ల విద్య రాశి మెఱయఁ
జేయు చుంటి నిపుడు శ్రీ హేమలంబియన్
వత్సరమున (1957–58) దీని వ్రాయు నాఁడు.



1. శ్రీ చింతలపాటి సీతారామచంద్రవరప్రసాదమూర్తి రాజు, M. L. A.
(శ్రీ బాపిరాజుగారి కుమారుడు) పత్తేపురము.

ముమ్మొదటం గుడివాడను
బిమ్మట మా తణుకునందు విద్యార్థులకున్
గమ్మని తెలుఁగుం జెప్పుచు
నెమ్మది విశ్రాంతిఁ గొంటి నే (1957 జులై 30) నానాఁడే.

పాయని ప్రేమ నుత్తరము వ్రాసి సఖుండగు నడ్సనమల్లి నా
రాయణరావు డాక్టరు నలంద కళాలయమందు నాంధ్రవి
ద్యాయత శాఖకున్ గురు పదంబును గొమ్మన, సమ్మతించి యా
ప్యాయత మీఱ నేను గుడివాడను జేరితిఁ మోదమందుచున్.

అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు
తొలుత నుద్యోగమున నేను నిలిచి నప్పు
డాదరించిన కృతము నా యాత్మఁ దలఁచి
యతని పేరి కళాశాలయందె యుంటి.

విశ్వకవి రవీంద్రునికడ విద్య లెల్లఁ
గఱచి కవి యౌచు మేటి మంతిరియు నౌచు
ప్రథితుఁ డైనట్టి గోపాల రడ్డిచేత
నాంధ్ర నాలంద కాలేజి యవతరించె (1957 ఆగష్టు 11).

గోపాలకృష్ణ పుత్త్రులు
నాపాలిటి కల్పకములు, నారాయణరా
వా పుణ్యతిథినె నన్నను
జేపట్టిరి ప్రేమరసము చిప్పిలుచుండన్.

కులపతిగ మీార లిచటనె
నలువొప్పఁగ నిలువుఁడంచు నారాయణరా
వెలనవ్వు తొలఁక నిరతము
పలుకుచు నుండంగ బాబు లిర్వురుగూడన్.

ఓపికున్నన్ని నాళ్లు మీా రుండవలయు
స్నాన భోజనములు మాదు సౌధ మందె
సలుపవలె నని ప్రేముడి దొలకరింపఁ
జేయి పట్టుక చెప్పిరి హాయి గూర్ప.

తాను సిద్ధాంతముననుండి తఱచుగాను
పెద్ద బాబిట కరుదెంచి పృచ్ఛచేయు
రాజ రాజేశ్వరీదేవి రాఁగ వెంట
నస్మదీయంబు క్షేమంబు ననుదినంబు.

శాసన సభ్యుండై ప్రజల సౌఖ్యము గోరుచు దేశసేవలో
వాసియు వన్నెయుం గనెడు పావన భావుండు పెద్దబాబు వ్య
త్యాసము లేని గౌరవము అన్నను దానును బిడ్డలున్ సద
భ్యాసముగాంగ నాయెడ నపారముగాం గనుపర్తు రెప్పుడున్.

కురివికులంపురాణి తనకున్ సతిగా సుతు లిర్వు రాత్మజా
సరసిజనేత్ర యల్లుండును సంతసముం బొనరించు చుండంగా
సరసుండు పెద్దబాబు నను సర్వవిధంబుల గారవించు నా
కలిపిన విద్యయన్ ఫలిత కల్పక వృక్షము గాంగ నిత్యమున్.

సిద్ధాంతమున నుండి శుద్ధాంత కాంతయా
రాజేశ్వరీదేవి ప్రణయమూర్తి
వారంబు వారంబు వచ్చి నా క్షేమంబు
గనుంగొని తన పతి కడలికడను
'మంగినపూండి'లో మంజుల వనములోం
గట్టిన భవనంబు గళల నరయం
దోకొని నన్నును దోడికోడలు జయ
ప్రదం దమ సుతులను వారిరాశి

వీచికా హస్తముల నాకు వీవఁజేసి
యన్నపానీయములు నిచ్చి యాదరించి
మధుర కవితల వించు సమ్మాన మొనర
గురువుగా నెంచి పూజించి కొనుచు నుంద్రు.

అన్య దుర్నిరీక్షులగుచు నడరుచున్న
బాబు లిర్వురు నను( బితృభావమునను
గంటికిని రెప్పపోలిక( గాచుచుందు
రెన్ని జన్మల పుణ్యమో యిది యెఱుంగ.

ఒకయెడ నాల సాలలు మఱొక్కెడ ధాన్యపుకొట్టు లొప్పఁగా
నొకయెడ దేవళంబు లిఁక నొక్కెడ వాహనముల్ వెలుంగఁగా
సకల నవీన భోగముల సారము గ్రోలుచు చంద్రశాలలన్
ప్రకట బిడౌజ వైభవులు బాబులు పొల్తురు సాదరంబునన్.

సరళాకారులు పూర్వధీరగుణ విస్తారార్జునాకారులున్
గరుణామూర్తులు వైభవోన్నతుల ఖండైశ్వర్య సందీప్తులున్
గురుభక్తుల్ కవితావలంబకులు శ్రీ గోపాలకృష్ణాత్మజుల్
వరభావుల్ నను గారవింత్రెపుడు సుబ్రహ్మణ్య విశ్వేశ్వరుల్.

తండుల యంత్ర మగ్రమున దానికి వెన్కటి సౌధమందు నే
నుండు కళాలయంబెసఁగు చుండును దానికి వెన్క భాగమం
దుండెను లక్ష్మిసౌధ మటనుండును సౌమ్యుఁడు విశ్వనాథుఁడా
ఖండల వైభవోన్నతుఁడకంపిత దానకళా విదగ్ధుఁడై.

లక్ష్మి సౌధము ప్రాంగణంబున విశాలంబైన పూఁదోఁటలో
లక్ష్మి పుత్రుఁడు చిన్నబాబు సతితోఁడన్ బుత్ర మిత్రాళితోన్
లక్ష్మిం బింతయు లేని సచ్చరితతో నాకైతలన్ వించుఁ దా
లక్ష్మి నాథు హృదంతరంబున సదా ప్రార్థించు సద్భక్తిమై.

తాను గాంచినాఁడు జయ ప్రదామ తల్లి
వలన ముగురు పుత్రకుల నపారబుద్ధి
యుతుల ముగ్గురు మూర్తుల కుద్దియైన
వారనుచుఁ గనువారలు ప్రస్తుతింప.

నిజనాథుఁ జూడవచ్చిన
నిజబంధుల స్నేహితులయు నిఖిల జనులయున్
ఋజువర్తనంబు లరయుచు
అజేయగుణవతి జయప్రదాంబిక యలరున్.



శ్రీమతి జయప్రద

శ్రీ ఆదుసుమిల్లి విశ్వేశ్వరరావుగారి గృహిణి

స్నానంబు చేయఁగాఁ జనినట్టి ననుఁజూచి
ఆయత్తపఱచు నుష్ణాంబువులను
వార్చి నే నరుదేర వంటవానినిఁబిల్చి
వేఁడికాఫీ సమర్పింపఁజేయు
కడుపారఁ గాంచిన గారాబుబిడ్డల
కన్న ముందుగ నాకు నన్నమిడును
'ఫలహారములు' తెచ్చి పళ్ళెంబులోఁ బెట్టి
పుచ్చుకొండని చాల బుజ్జగించు.

మధ్య మధ్యను మధురాతి మధురమైన
సరస సల్లాపములు చేసి సతిని సుతుల
విడిచి వచ్చిన యట్టి నా దుఃఖము నుడుపు
దానకల్పవల్లి జయప్రదామతల్లి.

వలసినప్పుడు జున్ను వచ్చినా కొంచెము
స్వీకరింపుఁడు జబ్బు చేయుదేమి
అప్పడంబులు రెంటి నారగింపుఁడు మీకు
ఇష్టమంచును వింటి నింతమున్న
మీఁగడ పెరుఁగుతో మీరు భుజింపుఁడు
మోమోటపడి లేచి పోకుఁడెపుడు
శనివార మీ ప్రొద్దు శాకపాకంబులు
సుష్టుగా భుజియించి తుష్టిగనుఁడు

రంగపురమునుండి రాగంబు మీఱఁగా
బాబుగారు గబురు పంపినారు
రాజుగారిఁ గనుమ! రారాజు వలెనంచు
తల్లియై జయప్రద పలుకు నను.

పలికెనా యెదియేని పలికిన పలుకులో
జలజల అమృతంబు జాలు వాఱు
నడచెనా యెటనేని నడచిన చోటెల్ల
పద్మరాగచ్ఛాయఁ బరిఢవిల్లు
నవ్వెనా చిఱునవ్వు నవ్విన నవ్వులో
ముత్యాల సరములు పోహణిల్లు
చూచెనా యెదియేని చూచిన చూపులో
కరుణారసంబు వెన్నెలలు కాయు

కట్టు బొట్టుల హైందవాకార మహిమ
తెల్లరాసులు రాసులై మెసక మెసఁగు
శ్రీ జయప్రద; యా కాంత చేడె యగుట
కెంత పుణ్యముచేసె విశ్వేశ్వరుండు!

తిలకించు నొకమాఱు పులకించి ముంగిట
యుద్యానవనములో నున్నపూలు
పొడగాంచు నొకమాఱు బొడ్డన బావిలో
విరిసెడు తామర విరులు సొబగు
పరికించు నొకమాఱు పనివాండ్ర చేఁతల
ప్రాలు మాలికలున్న వాలకములు
ఆరయు నొక్కమాఱాత్మనందనులకు
పాఠముల్ చెప్పెడి వారి తీరు

కాంచు నొకమాఱు వంటల గరగరికలు
అరయు నొకమాఱు గోవుల యందములను
మేరుగిరి మీఁద విహరించు గౌరివోలె
దానకల్పవల్లి జయప్రదా మతల్లి!

ఆమె యెఱుఁగ నట్టి యాధ్యాత్మిక విషయ
ము లెవియు గలుగవని తెలుపు టరయ
పిష్ట పేషణంబు; వేదాంతమూర్తి జ
య ప్రదాంబ శివపదావలంబ.

సుందరోద్యాన విశోభిత ప్రాంగణ
విలసిత సౌధరాడ్విలసనంబు
తేనియల్ పలుకుల సోనలుగా ప్రియా
లాపముల్ సలుపగా నోపు సతులు
వినయ భూషణు లౌచు విద్యావివేకులై
మూరిఁబోయెడు నట్టి పుత్రకులును
ఆజ్ఞానువర్తులై యనుదినంబును జెంత
సేవఁజేయుచు నుండు సేవకాళి

ఇచ్చకుం దగ్గ ధనమును నెసఁగు చుండ
రామకృష్ణ సుబ్రహ్మణ్య నామధేయు
లిచ్చ విశ్వేశ్వరుఁడును సేవించుచుందు
రతిథి పూజలచే గృహస్థాశ్రమంబు.

విశ్వనాథు కులీను బిలిపించి సత్యనా
రాయణుఁ బూజించెఁ బ్రజ్ఞమీఱ
అభినవ తిక్కన కాహ్వానమును బంపి
సన్మానమును జేసె సరసలీల
కడు భక్తి రావించి కాటూరి వేంకటే
శ్వరుని మహాకవి సత్కరించె
వేలూరి శివరామ విబుధేంద్రునిన్ బిల్చి
రాంక వాదుల నిచ్చి ప్రస్తుతించె

భరత దేశాభివృద్ధికై పైఁడి వలయు
భారతీయులు బంగారు పంపుఁడంచు
భారత ప్రధానులు నెహ్రూ పలుకఁగానె
ఆలి మంగళ సూత్రంబు నంపినాఁడ.

జవహరులాలు నెహ్రూ కడు సంతస మందుచు నాదు దానమున్
వవహరె యంచు మెచ్చుకొని వ్రాసె ప్రశంసలు దెల్పు లేఖలన్
ఎవరును నిట్టి గౌరవము నింతకుఁ బూర్వము గాంచలేద నా
భవము తరించె నంచు భగవంతుని కంజలిసేతు నిత్యమున్.

* భరతరాష్ట్ర నేత బాబురాజేంద్ర ప్ర
సాదు దీర్చినట్టి సభను నేను
గణన కెక్కినాఁడ గవికోటి లోపల
నింతకంటె నాకు నేమి వలయు.

జయ పురాధీశుండు స్వయముగాఁ జనుదెంచి
నామేడ వసియించి నన్నుఁ దనిపె
రామకృష్ణ దివాను ప్రాణ మిత్రంబుగా
మన్నించి నన్నేలు నన్నిగతుల

*ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ ప్రారంభమున 1957-ఆగష్టు 7.





No. 991-PMH/57

New Delhi,
May 31, 1957



Dear friend,

Thank you for your letter of the 27th May. It is very good of you to send me your 'Mangal Sutra', and I appreciate this gift. But we have decided not to accept any such gifts in gold at present. I am, therefore, returning it to you. It is much better that you should yourself keep this token which is of such value to you.

Yours sincerely,

Jawaharlal Nehru

Pandit P. Satyanarayanu Raju,
'Vikrama Vilas',
Tanuku (Andhra).

దుర్గాంబ రత్నాల దుగ హారములు దెచ్చి
నా పుత్రికల పెండ్లినాఁ డొసంగె.
పెదబాబు పినబాబు వీరి యర్ధాంగులు
సేవింత్రు నను గురుదేవుఁ డనుచు

అడుసుమల్లి నారాయణుఁ డనెడు సఖుఁడు
ఆంధ్ర నాలంద పేర నా యశము పెంచె
జయపురాస్థాన కవిరాజు సంతసమున
అడుసుమిల్లి కులాస్థాని నడరు నేఁడు.

జయపురాధీశ్వరు సాహిత్య సమ్రాట్టు
విక్రమదేవుని వినుతిచేసి
ప్రాణంబు ప్రాణమా రామకృష్ణ సఖుని
విన్నాణ మొప్పఁగా సన్నుతించి
నాలంద నేతయా నారాయణాఖ్యుని
ననిశంబు మనములో నభినుతించి
అడుసుమిల్లి కులీనులా బాబులిద్దఱి
నెల్ల వేళలను దీవించి మించి

తక్కఁగల మిత్రవర్గంబు తలఁచి తలఁచి
కృతము మఱువక రసమయ కృతులు వ్రాయు
చాత్మదనియంగ నాలంద యనెడు పేర
వెలయు కాలేజి లోపల నిలిచి యుంటి.

# ఆశీస్సు

పాయని పూర్వజన్మపరిపాకమునం బెను మెచ్చ సత్యనా
రాయణరాజ! నీవు కవిరాజవు – డాక్టరు అడ్సుమల్లి నా
రాయణరావు నేను, కడు యౌవనమందున నుంటి మిందు – నీ
ప్రాయమునందునం దిరిగివచ్చితి మీ గుడివాడ కేలనో?

రాయల కిచ్చె పెద్దన పురాతన గాథ నటంచు కించతన్
స్వీయచరిత్ర కావ్యము రచించి యొసంగితి వంకితమ్ము – నా
రాయలవంశజాతునకు రాచరికమ్మున మిన్న కడ్సుమి
ల్లీయున కీవు – నేటికి ఫలించెను మీదు భవంబు లేకమై.

రాయలు, కాకతీయులు ధరాధిపులౌటయెకాదు కమ్మ వం
శీయులు పెమ్మసాని నృపశేఖరులున్ దివిసీమ యార్లగ
డ్డీయులు కమ్మరాజులె, ముడింబడి వారల కన్య లడ్సుమ
ల్లీయులఁగొంట నీవు విని లే, కృతి కన్యక నిచ్చితీ విధిన్.

బ్రహ్మధ్యాని, నలంద పోషకుడు, మంత్రవ్యక్తముం జేయగా
బ్రహ్మదత్త వరప్రసాదమునఁ గావ్యశ్రీనిఁ జేపట్టె సు
బ్రహ్మణ్యేశ్వరుఁ డడ్సుమిల్లి కుల పారావార పూర్ణేందుఁడో
బ్రాహ్మణ్యాంబ! త్వదీయ మాశిషముపై వర్షింపరే ప్రేముడిన్.

'తెలుగురాజు' కావ్యశ్రీని వలచి, తగునె
రాజరాజేశ్వరికిఁ దోడి రాణి సేయ
అడుసుమిల్లి సుబ్రహ్మణ్యామరవరవలు
పెమ్మసానివారలతో నిజమ్ము నమ్మ.

గుడివాడ
1-1-58

అడుసుమల్లి నారాయణరావు
ఎం బి., బి. యస్.

# పండితరాజు కృతులు

## (1) పద్యకావ్యసంపుటి

1. రామకృష్ణ (ద్విపద)
2. ఆరాధనము
3. కవిత్రియావేదనము
4. విజయశ్రీ
5. చంపకమాలినీపరిణయము (అచ్చ తెలుగు)
6. రసాలము
7. భీమేశ్వరశతకము
8. విక్రమదేవశతకము
9. జ్ఞానాంజలి (1200 నీతిపద్యాలు)
10. పతిభక్తి
11. కీచకవధ
12. కరుణకము
13. పద్యకథలు
14. రాజానందము (అర్థాలంకారములు)
15. శ్రీ రామకృష్ణ యశోభూషణము (కావ్యాలంకారములు)
16. శిష్టవ్యాకరణములు (హారికారికావళి)
17. క్రిస్టమస్ యస్కార్షన్
18. శ్రీ కలనలు రాజు
19. తెలుఁగురాజు

## (2) వచనకావ్య సంపుటి




: ప్రతులకు :

శ్రీ విశ్వవిద్యా విలాసము

తణుకు




భారతీ ప్రెస్, తెనాలి.

# సవరణ

## స్వీకృతి — దశదిశా

| పేజీ | పద్యము | పాదము | సవరణ | పేజీ | పద్యము | పాదము | సవరణ |
|---|---|---|---|---|---|---|---|
| 12 | 2 | 3 | నెంజిలి | 71 | 4 | 1 | సాగరులును |
| 53 | 1 | 3 | చూచియొక్క | 79 | 4 | 2 | అరుణాకారులు |
| 57 | 1 | 3 | మగణ్యమై | 83 | 1 | 2 | నొక్కమాఱు |
| 60 | 4 | 4 | ఈ | ii ఆశీస్సు | 1 | 2 | బ్రాహ్మీత్ర |